ఎఱ్ఱన - పోతనల

# కవితా మాధుర్యములు

(భక్త ప్రహ్లాదుని దివ్య చరిత్రము)





రచన:

పి. దుర్గారావు, ఎం.ఓ.యల్.

ప్రథమ ముద్రణము
300 ప్రతులు

ప్రభవనామ సంవత్సరము
గ్రీష్మము—జ్యేష్టము



మూల్యము పదిరూపాయలు

ముద్రణము :
వెంకటరత్నా, విజయవాడ-2

---

ప్రతులకు :
పి. దుర్గారావు, యం.ఓ.యల్
చెరుకుపల్లి పోస్టు
(వయా) నక్రేకల్
కేతేపల్లి మండలము, నల్లగొండజిల్లా



# సమర్పణము

పదునాల్గవ శతాబ్దమున రెడ్డి రాజ్యమును స్థాపించిన
అనవేమ భూపాలుని సోదరుడును,
సేనానియు,
మహాకవి ఎఱ్ఱాప్రెగడ కవితాశక్తికి దోహదము చేసిన
రసహృదయుడును, సాహితీప్రియుడునునైన

మల్లారెడ్డికి పుష్పాంజలులతో.

# వినయవాక్యము

ప్రబంధకవితా రచనకు, భక్తితత్వమునకును మార్గదర్శకు లయిన ఎఱ్ఱన-పోతనగారలకవితా విశేషములనుచర్చింపదగిన పరిజ్ఞానముగాని, ప్రతిభా పాటవములుగాని లేని సామాన్యుడను. ఆ మహాకవులపై నాకు గల భక్తి ప్రపత్తుల చేతను, అట్టి మహానుభావులను స్మరించిన ధన్యుడనగుదునను భావము చేతను నే నీ వ్యాసమును స్పృశించితిని.

వృత్తిచేత నాంధ్రభాషాబోధకుడనగుట చేతను, సాహిత్య విషయములందు స్వల్పాల్పమైనను యభిరుచి యుండుట చేతను, అపుడపు డొకటిరెండు సాహితీ గ్రంథములను ప్రచురించుట చేతను, నీ వ్యాసరచనకు గారణములు కావచ్చును.

నా యీ వ్యాసరచనకు ముఖ్యముగా ఎఱ్ఱన్న - పోతన్నగారల గ్రంథ పీఠికలేనని చెప్పవచ్చును.

శ్రీవావిళ్ళవారు ప్రచురించిన శ్రీ వేలూరి శివరామ శాస్త్రిలవారి పీఠికతో నున్న నృసింహ పురాణమును, శ్రీ వేంకటరామ అండ్ కంపెనీవారు ప్రచురించిన ఆంధ్ర మహాభాగవతమును ఆధారముగా జేసికొని నే నీ వ్యాసమును సిద్ధబఱచితిని. వారలకు కృతజ్ఞుడను.

ఎఱ్ఱన్నగారు నృసింహపురాణమున జెప్పినట్లు 'కతిప యాక్షర పరిగ్రహాజనితంబైన నైసర్గిక చాపలంబు కతంబున' నేనును ఈ వ్యాసమును గూర్చితిని. ఇందనేకములు భాషా దోషములు, భావదోషము లుండ వచ్చును, విజ్ఞులు తెలియ జేసిన సరిదిద్దుకొందును.

ఎఱ్ఱన్నగారి పద్యముతో నా యీ వినయవాక్య మును ముగింతును.

ఉ॥ మించినవేడ్క వీనులకు
మిక్కుటమై మృదువృష్టిగమ్మ రా
యంచలు కూయ క్రౌంచమును
నావలఁ గూయ గడంగుభంగి ప్రా
ఘాంచిత శబ్దసారులు మ
హాకవు లాద్యులు కావ్యశయ్య గీ
లించిన కీర్తిసంగ సుఖ
లీలకుఁ నేనును గాంక్ష జేసితిన్ !



# విషయసూచిక





హరి ఓం

సంవిశ్వరూప !

భక్త ప్రహ్లాదుని దివ్య చరిత్ర రచనము

ఎఱ్ఱన - పోతనల

# కవితా మాధుర్యములు

చ. కరకమలంబునందుఁ బటి
కంపుఁ గమండలు వచ్ఛకాంతి భా
సురమగు మాక్తికంపు జప
సూత్రముదాల్చుట బ్రహ్మవాదియై
పరఁగిన హంసముం బిలిచి
బాలమృణాళముఁ జూపు చందనా
సిరిఁ దిలకింప నొప్పు బుధ
సేవితమూర్తిఁ దలంతు భారతిన్ !

విష్ణుభక్తి పుంభావుకుడైన శ్రీ భక్తప్రహ్లాదుని చరిత్రము భక్తిరస తరంగిణులతో గూడిన అమృత నదీప్రవాహము. ఒకసారి చదివినంత మాత్రముననే భక్తిభావము హృదయమును వశీకృతముగావించుకొని యానందలోకముల విహారింపజేయును. మోక్ష మార్గమున కాయత్త చిత్తుల గావించును. ఇట్టి ప్రహ్లాదుని చరిత్రము నెందరెందరో మహానుభావులు గద్యపద్యాత్మకముగను, యక్షగాన రూపకములుగను తమ కవితాశక్తిచే గీర్తించి, తాము ధన్యులై తమ కవితాశక్తిని యజరామరము గావించుకొనిరి.

కవితా ప్రపంచమున ధ్రువనక్షత్రము లనదగిన మహాకవులు ఎఱ్ఱన—పోతనలు ప్రహ్లాద చరిత్రములయందు

తమ కవితాశక్తిచే నఖండ మాధుర్యములొలికించిరి. తెలుగు భాస, తెలుగు ప్రజలున్నంతవఱకు నీ మహామహులు రచించిన ప్రహ్లాద చరిత్రములు చిరస్థాయిగ నుండును.

ఇరువురును భగవత్ప్రసాదితమైన కవితా శక్తిగల వారలు. వారలెన్ని గ్రంథములు రచించినను, వారలెంత కవితా మాధుర్యమును లోకమునకు ప్రసాదించినను, ప్రహ్లాద చరిత్రముల రచనయందు వారు తమతమ కవితా సౌందర్య మాధుర్యములనేగాక, భగవద్భక్తి సంబంధములైన నిశ్చితాభిప్రాయములను, తమ విజ్ఞాన భాండాగారము నందుగల సమస్త నిధులను ప్రదర్శించిరి.

భాగవతము సప్తమ స్కంధమునందలి పోతన్నగారి ప్రహ్లాద చరిత్రమును జదువునపుడు పరమ భక్తుడైన ప్రహ్లాదుడుమాత్రమేగాక పోతన్నగారు సహితము నిండు హృదయముతో మనకు సాక్షాత్కరించును. అట్లే నృసింహ పురాణమును బఠించునపుడు ఎఱ్ఱన్నగారు సృజించిన కావ్య జగత్తునందు విహరించుచున్నటుల మనకు రసానందము గలుగును.

పోతన ప్రహ్లాద చరిత్రము కృష్ణా గోదావరీ నదీ ప్రవాహములవలె కలకల నాదములతో, కళ్యాణ రాగములతో బులకింపజేసి, పూర్ణభక్తిని మనలను బులకింపజేయును. అట్లే ఎఱ్ఱన నృసింహ పురాణము గంగానదీ ప్రవాహమువలె దివినుండి భువికి బ్రవహించినట్లు భక్తిభావముతో బాటాశ్చర్యచకితుల గావించును.

కవి పండిత లోకమునకు సమ్మోదములైన యీ రెండింటిని దులనాత్మక దృష్టితో బరిశీలింతము. అట్లు పరిశీలించుటకు ముందా మహనీయుల జీవితములను, వారు రచించిన గ్రంథములను బరిశీలించి వారలకు నమోవాకము లర్పింతము. ముందుగా ప్రబంధ పరమేశ్వరుని జీవితము నధ్యయనము గావింతము!

## ఎఱ్ఱాప్రెగడ జీవిత కాలము

కవిత్రయములో తృతీయుడైన యెఱ్ఱాప్రెగడ పదునాల్గవ శతాబ్దమునకు జెందినవాడని పరిశోధకుల నిశ్చితాభిప్రాయము. కృష్ణానదీ తీరమున రెడ్డిరాజ్యమును స్థాపించిన ప్రోలయ వేమారెడ్డి క్రీ.శ. 1324 నుండి 1350 వఱకు రాజ్యము పాలించినట్లు తెలియుచున్నది. ఆ రాజచంద్రుని యాస్థానమునం దెఱ్ఱాప్రెగడ యుండినట్లును, తాను రచించిన హరివంశము నతని కంకితమిచ్చినట్లును, నిశ్చితమైన యాధారములు గలవు. కావున యెఱ్ఱాప్రెగడ పదునాల్గవ శతాబ్దమునకు జెందినవాడని రూఢిగా జెప్పవచ్చును.

ఎఱ్ఱాప్రెగడ మహాకవి నన్నయ తిక్కనలు వదిలిన భారతారణ్య పర్వశేషమును బూర్తిచేయుటయేగాక నృసింహ పురాణము, సంక్షేప రామాయణము, హరివంశములను రచించి, యాంధ్రభాషా సరస్వతి కపూర్వాభరణములను సమకూర్చిన మహనీయుడు.

ఈ మహాకవి జీవించిన కాలమును గుఱించి యనుమానములుగాని, వివాదాస్పదమైన విషయములుగాని లేవు. తాను రచించిన హరివంశమును అనవేమ భూపాలున కంకిత మిచ్చినట్లును, ఆ భూపాలుని యాస్థానమున బండితునిగా నుండినట్లును హరివంశ గ్రంథపీఠికయందు గలదు.

దీని వలన అనవేమ భూపాలుడు రెడ్డిరాజ్యమును క్రీ.శ. 1324లో కృష్ణానదీ తీరమున స్థాపించినట్లు చరిత్ర తెలుపుచున్నది. ఈ భూపాలుని పూర్వులు కాకతీయ ప్రభువులయొద్ద క్షాత్రధర్మము నిర్వహించినట్లును, కాకతీయరాజ్య పతనానంతరము వారు కృష్ణానదీ తీరమునకు తరలివచ్చి, యచ్చటగల తురుష్కులనోడించి, హిందూధర్మ సంరక్షణార్థమచట రెడ్డిరాజ్యము స్థాపించినట్లు కీ. శే. మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, బూర్గుల రామకృష్ణరావుగారు వ్రాసిన చారిత్రక పరిశోధనా వ్యాసముల వలన దెలియుచున్నది. వీరు మొదట కొండవీడును రాజధానిగా జేసికొనిరిగాన వీరిని కొండవీటి రెడ్డిరాజులందురు. తరువాత వీరు అద్దంకి రాజధానిగా జేసికొన్నటుల తెలియుచున్నది.

ఈ వేమభూపాలుని సోదరుడు మల్లారెడ్డి, సేనాని. అన్నకు గుడిభుజము. సాహిత్యాభిమాని. రసహృదయుడు. ఈ మల్లారెడ్డి ప్రాపువలననే యెఱ్ఱాప్రెగడకు వేమభూపాలుని యాస్థాన ప్రవేశము గలిగెననియు, ఈతని ప్రోత్సాహము వలననే యెఱ్ఱాప్రెగడ గ్రంథ రచనకు దోహదము జరిగెననియు జెప్పుదురు.

ఈ మల్లారెడ్డి సేనానిగా అన్నయగు వేమభూపా లుని రాజ్యప్రతిష్ఠతకు దోడ్పడెననియు, తరువాత నీతడు కంనుకూరు ప్రాంతమును పాలించెననియు, ఈతని వంశీకులు కంనుకూరు రెడ్లుగా ప్రసిద్ధి చెందిరనియు కీ. శే. బూర్గుల రామకృష్ణరావుగారి చారిత్రక వ్యాసము వలన దెలియు చున్నది.

మహాకవి యెఱ్ఱాప్రెగడ రెడ్డిరాజుల యాస్థాన ప్రవే శము మఱియొక విధముగా గూడ జరిగినదని యూహింప వచ్చును. ఈ రెడ్డిరాజులకు ప్రెగడ వంశమువారు మంత్రు లుగానున్నట్లు తెలియుచున్నది. వేమ భూపాలునికి రామన ప్రెగడ మంత్రిగా నుండెను. ఆతని ప్రాపకమున గూడ యెఱ్ఱనకు రాజాస్థాన ప్రవేశము లభించినట్లుగా గూడా భావింపవచ్చును.

ఏదేమైనను మహాకవి యెఱ్ఱాప్రెగడ ప్రోలయ వేమ రెడ్డి యాస్థాన పండితుడైనట్లును, వేమభూపాలునికి తాను రచించిన హరివంశము నంకిత మొసంగినట్లును స్పష్టమైన విషయము. వేమభూపాలుడు క్రీ.శ. 1324 నుండి 1350 వఱకు రాజ్యమును పాలించినట్లును చరిత్ర సాక్ష్యమిచ్చు చున్నది. ఇందువలన నీ మహాకవి పదునాల్గవ శతాబ్దమునకు జెందినవాడని ధృవీకరించి చెప్పవచ్చును. ఇందు ద్వివిధాభి ప్రాయములకుగాని, సందేహములకుగాని తావులేదు.

# ఎఱ్ఱాప్రెగడ జన్మస్థానము

మహాకవి యెఱ్ఱాప్రెగడ జన్మస్థానము పాకనాటిలో గల గుడ్లూరని పండితాభిప్రాయము. విప్రనారాయణ యను కావ్యమును రచించిన మల్లన యెఱ్ఱాప్రెగడ చెదలువాడ నిలయుడని (విప్రనారాయణ 1-13) పేర్కొనెను. దీనినిబట్టి యెఱ్ఱాప్రెగడ కొన్నాళ్ళ తరువాత గుడ్లూరునుండి చెదలువాడకు బోయి నివసించినట్లు మనమూహింప వచ్చును. రెడ్డి రాజుల యాస్థానకవి యగుటచే చెదలువాడయందు నీ మహాకవికి గొంత భూమిని యగ్రహారముగా నిచ్చిరేమో పరిశీలింప వలసి యున్నది.

అంతేగాక ఎఱ్ఱాప్రెగడ పితామహుడు ఎఱ్ఱపోతనను గుఱించి కూడ పరిశోధింప వలసి యున్నది. అతడు కరాపత్రి వృత్తియందు ప్రసిద్ధుడట! చెదలువాడ ప్రాంతమున కొంతభూమి సంపాదించెనేమో! అది యెఱ్ఱాప్రెగడకు సంక్రమించెనేమో ! లేదా చెదలువాడ ఎఱ్ఱాప్రెగడ మేనమామల యూరై యుండి, యచటికేగి, స్థిరనివాస మేర్పఱచు కొనినాడేమో !

మఱియొక ప్రధానమైన విషయ మేమనగా ఎఱ్ఱాప్రెగడ కవితారచనకు దోహదము జేసిన మల్లారెడ్డి యీ చెదలువాడ యందు రామలక్ష్మణుల గుడి కట్టించినట్లుగను, ఈ చెదలువాడ గ్రామమునకే రెడ్డిమల్లవరమను నామకరణము చేసి, రామలక్ష్మణుల గుడికి దేవభోగముగా నర్పించినట్లుగను రెడ్డిమల్లవరపు శాసనము వలన దెలియుచున్నది.

ఈ రెడ్డిమల్లవరము వంగవోలునకు దాపున గుండ్లకమ్మనది యొడ్డున గలదు. ఈ రెడ్డిమల్లవరము గ్రామము

నకును వేమభూపాలుని సోదరుడు మల్లారెడ్డికిని గాఢమైన సంబంధ మేదో యుండి యుండ వచ్చును. సాహిత్యాభిమానియు రసహృదయుడునైన మల్లారెడ్డి ఎఱ్ఱనకు సకల సౌకర్యములను గల్పించి యచటి కాహ్వానించినాడేమో! తాను ప్రతిష్ఠింపదలచిన రామలక్ష్మణులపై కవిత నల్లుమని ప్రార్థేయ పడినాడేమో! ఎఱ్ఱాప్రెగడయు నందుల కియ్యకొని గుడ్లూరును వదిలి చెదలువాడయందు స్థిరనివాస మేర్పఱచుకొని సంక్షేప రామాయణమును వ్రాయ నారంభించినాడేమో!

ఇంతకు బిండితార్థము-మహాకవి ఎఱ్ఱన జన్మస్థానము గుడ్లూరనియు, తరువాత చెదలువాడయందు స్థిరనివాస మేర్పఱచుకొనినాడనియు మన మూహింపవలసి యున్నది.

## ఎఱ్ఱాప్రెగడ వంశ వృక్షము

నృసింహ పురాణమునందుగల పీఠికలో నీసీసపద్యము గలదు. ఈ పద్యమువలన ఎఱ్ఱాప్రెగడ వంశక్రమము తెలియు చున్నది.

సీ॥ ప్రజ్ఞాపవిత్రుఁ డాపస్తంబ సూత్రుండు
శ్రీవత్స గోత్రుఁ డూర్జిత చరిత్రుఁ
డగు బొల్లనకుఁ బోలమాంబకుఁ బుత్రుండు
వెలనాటి చోడునివలన మిగుల
మన్నన గన్న భీమనమంత్రి పౌత్రుండు
పేరమాంబా మనఃప్రియుడు పోత

పోంబికావిభు సూరనార్యు మజ్జనకుని
బొల్ల ధీ నిధికిని బోలనకును

గీ॥ జన్ననకు ననుజన్మునిఁ గన్నతండ్రి
వేఁగినాఁటఁ గరాపత్రి వృత్తిమంతుఁ
డనఘు డెఱపోత సూరి కంసారి చరణ
కమల మధుకరపతి సార విమల యశుఁడు!

పై పద్యము వలన యెఱ్ఱన్నగారి వంశవృక్షము తెలియు చున్నది. ఎఱ్ఱాప్రెగడ వారిది శ్రీవత్స గోత్రమనియు, ఆపస్తంబ సూత్రమనియు దెలియుచున్నది.

ఎఱ్ఱాప్రెగడ వంశస్వామి భీమనయనియు దెలియు చున్నది. భీమన పుత్రుడు బొల్లన; అతని కుమారుడు ఎఱ్ఱపోతన. అతని కుమారుడు సూరన యని తెలియు చున్నది. అట్టి సూరన కుమారుడే మన ఎఱ్ఱన. ఎఱ్ఱాప్రెగడ తల్లిపేరు పోతమయని పై పద్యము వలన దెలియు చున్నది.

పై పద్యమును ఎఱ్ఱాప్రెగడ నృసింహ పురాణము పీఠికయందు స్పష్టముగా జెప్పికొనెను గాన యెట్టి సందేహములకును దావులేదు. ఎఱ్ఱనకు దన పితామహుడు ఎఱ్ఱపోతనయందు మిక్కిలి గౌరవాదరములు గలిగి యున్నట్లు నృసింహ పురాణము నందలి పీఠికవలన దెలియు చున్నది.

# ఎఱ్ఱాప్రెగడ విద్యా గురువు

ఎఱ్ఱన తన విద్యాగురువును గురించి స్పష్టముగా చెప్పలేదు. నృసింహ పురాణమునందు ఆశ్వాసాంత గద్యములందు "ఇది శంకరస్వామి సంయమీశ్వర చరణ సరోరుహ ధ్యానానంద సౌందర్యధుర్య శ్రీసూర్య సుకవి మిత్ర సంభవ శంభుదాస లక్షణాభిధేయ యెఱ్ఱయనామ ధేయ ప్రణీతంబైన లక్ష్మీనరసింహావతారంబను పురాణ కథయందు" అని పేర్కొనెను.

ఎఱ్ఱయ శ్రీ శంకరస్వామిని గురువుగా పేర్కొనెను. కాని విద్యాగురువుగా స్పష్టముగా చెప్పలేదు. శ్రీ శంకరస్వామి కామకోటి మున్నగు పీఠములకుం జెందిన యాచార్యుడు కాదు! నిత్య శివరాత్రి వ్రతుడగు శైవా చార్యుడు! ఈ శంకరస్వామిని యాధ్యాత్మిక గురువుగా భావింప వలయునేగాని విద్యాగురువుగా భావించుటకు దగిన యాధారములు కనిపించుట లేదు. నృసింహ పురాణము లోనిది:

ఉ॥ యామము లెన్మిదింట నియ
తాకృతిఁ బ్రత్యహమున్ శివార్చనా
రామత యొప్ప నిత్య శివ
రాత్రి వ్రతంబుగఁ బూని భస్మ యో
గామృత తృప్తి మైఁ ద్రిజగ
దర్పిత లీలఁ దనర్చు శంకర
స్వామి మునీంద్రుడు భక్తజన
వత్సలు మద్గురు నాశ్రయించెదన్ !

ఈ క్రింది పద్యము హరివంశము లోనిది.

ఉ॥ కామ విలోభక స్ఫురహాల
గర్వ పరంపర క్రందు వాసి, హృ
త్తామరస స్థితుండగు స
దాశివుఁ గాంచి తదేకచింత చిం
తామణియై దలిర్పఁ మది
దాకిన యున్నతిఁ గన్న శంకర
స్వామి గురుండు మా తలఁపు
సర్వము దానయి యుండు గావుతన్!

పై పద్యముల వలన శ్రీ శంకరస్వామిని యెఱ్ఱన యాధ్యాత్మిక గురువుగా భావించినట్లు స్పష్టమగుచున్నది. శ్రీ శంకరస్వామి యీ ప్రెగడ వంశమునకు నాచార్యులుగా నుండి యుండవచ్చును. శ్రీ శంకరస్వామి సకలభాషాతత్త్వ విశారదుడేమో! బహుపురాణ ధర్మముల నెఱిగినవాడేమో! నిగమాగమ శాస్త్రములను బుక్కిలించినవాడేమో! చిన్నతనమందు యెఱ్ఱనకు గబ్బము లల్లుట యందలి యాసక్తిని గాంచి తన బహుముఖ విజ్ఞానము నగ్గుబాలతో రంగరించి యెఱ్ఱనకు బోసినాడేమో!

మఱికొంత సూక్ష్మముగా బరిశీలించిన ఎఱ్ఱన విద్యాగురువు తండ్రియైన సూరనయేమోనని యొకయభిప్రాయము గలుగుచున్నది. నృసింహ పురాణమునందు తన తండ్రిని గుఱించి యీ పద్యమును జెప్పికొనెను.

ఉ॥ ప్రాజ్ఞప్రస్తుత భవ్యభోగ విభవ
స్ఫారాత్ముఁ డారాధ్య స

ర్వజ్ఞుం డప్రతి మాద్భుతోభయ కవి
త్వప్రౌఢ శబ్దార్థయో
గాజ్ఞాసిద్ధి ఘనుండు మజ్జనకుఁ డుద్య
త్కీర్తి శ్రీ సూర్యు డీ
విజ్ఞానాత్మక వాఙ్మయంబున ముదా
వేశోజ్జ్వలుం డయ్యెడిన్ !

'అప్రతిమాద్భుతోభయ కవిత్వప్రౌఢ శబ్దార్థయోగాజ్ఞాసిద్ధి ఘనుండు' అని తన తండ్రిని ప్రశంసించెను. అట్టి కవితా శక్తి తన తండ్రి నుండి సంక్రమించెనని చెప్పికొనినాడేమో యని స్ఫురించుచున్నది.

మఱి ఎట్టిన తన తండ్రిని విద్యాగురువుగా నేల జెప్పికొనలేదు? విచారింపవలసిన విషయము! ఏ శంకర స్వామిని దన సర్వస్వముగా భావించి యాశ్రయించెనో, తనకు మఱియొక విద్యా గురువు గలడని జెప్పికొనుట యుచితముగాదని భావించెనేమో! ఆ శంకరస్వామి తనకేగాదు! తన వంశము వారందఱికిని గురుస్వామి! తనతండ్రికిని గురువు. అట్టి శంకరస్వామిని గురువుగా జెప్పికొని, యాశంకర స్వామికే శిష్యుడైన తన తండ్రిని తన విద్యా గురువుగా జెప్పికొనుట యంతభావ్యముకాదని దలచెనేమో! నృసింహ పురాణము ప్రథమాశ్వాసమునందలి యీ పద్యభాగము గమనింపుడు!

ఉ॥ ఈ గుణకోటి యంతయును
నెక్కడ నొక్కెడఁ గల్మి దుర్లభం

భాగము సిద్ధమొ మునిగ
ణార్చితమైన రహస్యమేని "వి
ద్యాగురుఁడైన మద్గురుము
ఖాంబురుహంబునఁ గంటి" నిష్టుత
ద్యాగభిరూపితార్థము భ
వద్వచనంబుల నుత్తరం బగున్.

"విద్యాగురుడైన మద్గురు ముఖాంబురుహంబున గంటి" అని ఒక వాక్యముగలదు. ఈ వాక్యము రోమహర్షణుడు మునులతో బలికినదైనను ఎఱ్ఱన భావగర్భితముగా తన విద్యా గురువును పేర్కొనినాడేమోనని యూహింప వలసివచ్చుచున్నది. వివాదాస్పద విషయమును మఱింత తఱచి విచారింపవలసిన యవసరము లేదు.

ఎఱ్ఱనను శ్రీ శంకరస్వామి అధ్యాత్మిక ధర్మశాస్త్ర పురాణాదులతోడను, తండ్రి సూరన 'అప్రతిమాంధ్ర్యోభయ కవిత్వ ప్రౌఢ శబ్దార్థ యోగాజ్ఞా సిద్ధి' తోడను తీర్చిదిద్దిరని భావించినను దోసములేదుగదా!

ఏమైనను ఎఱ్ఱన 'శంకరస్వామి మునీంద్రుడు భక్తజన వత్సలు మద్గురు నాశ్రయించెదన్' అని చెప్పికొనెను గాన శ్రీ శంకరస్వామినే యెఱ్ఱన గురువుగా భావింతము! ఎఱ్ఱన వంటి ప్రబంధ పరమేశ్వరుని ఆంధ్ర సారస్వతార్చనకు ప్రసాదించిన శ్రీ శంకరస్వామికి ఆంధ్ర ప్రజలు అంజలి ఘటింపవలసి యున్నది. సూరనకు గూడ నమోవాకములు!

# ఎఱ్ఱన - వ్యక్తిత్వము

ఎఱ్ఱాప్రెగడ శంభుదాసుడయ్యును వైష్ణవ సాంప్రదాయములను ద్వేషించువాడుకాడు. అద్వైతభావ సుందరుడు! శివకేశవ భేదములేనివాడు! 'శివస్య హృదయం విష్ణుః విష్ణోశ్చ హృదయం శివః' యను తత్త్వమున కంకితమైన వాడు. అందువలన దాను శివభాగవతుడైనను విష్ణుకథా ప్రశస్తములైన గ్రంథములను రచించెను.

ఎఱ్ఱన మిక్కిలి సౌజన్యుడు! వినయవంతుడు! గురువులకు విధేయుడు! సదయమతి! సహృదయత, ధర్మ తత్పరత భావము లతని కవితలో బూవులు పూయును. శివభక్తుడు!

ఈ క్రింది పద్యమువలన ఎఱ్ఱని యెంతటి వినయ సంపన్నుడో గమనింప వచ్చును.

ఉ॥ మించిన వేడ్కఁ బీనులకు
మిక్కుటమై మధువృష్టి గ్రమ్మ రా
యంచలు కూయఁ గ్రౌంచమును
నావలఁ గూయఁ గడంగు భంగి బ్రా
పొంచిత శబ్దసారులు మ
హాకవు లాద్యులు కావ్యశయ్యఁ గీ
రించిన కీర్తిసంగ సుఖ
లీలకు నేనును గాంక్ష జేసితిన్!

ఇతర కవులను రాజహంసలుగా జెప్పి తనను క్రౌంచపక్షిగా జెప్పెను.

ఎఱ్ఱన ఒకచోట తనను గుఱించియు, తన కవితా శక్తిని గుఱించియు ముచ్చటించుచు 'సకలలోకైకవిదితుడైన నన్నయభట్ట మహాకవీంద్ర సరస సారస్వతాంశ ప్రశస్తి"

తన్నుఁ జెందిన'దని జెప్పికొనెను. దీనివలన యెఱ్ఱన యెంతటి వినయ సంపన్నుడో విశదమగుచున్నది.

అంతేగాదు. నృసింహ పురాణ పీఠిక యందు 'కతిప యాక్షర పరిగ్రహ జనితంబైన నైసర్గిక చాపలంబు కతంబున' దా నీ కృతి రచించుచుంటినని పేర్కొనెను. ఎఱ్ఱన యెంతటి సౌజన్యుడో యతని కవితాకుమారి గూడ నంత సౌజన్య వతియే !

అహ మనునది ఎఱ్ఱన కవితలో గానరాదు ! పర దూషణకు బహుదూరము ! పరమ భాగవతుడు. శంభు దాసుడు. పోతనవలె నీతడు గూడ కవితా వ్యాపారముచే జీవన్ముక్తికి దారులు వెదకికొనినవాడు. పోతన వ్యక్తి జీవిత ములోని గాథలవలె నీ మహాకవి జీవితములోని గాథలు మనకు దెలియరావు. అయినను నడుగడుగున యాతని కవితయందు గనిపించు రమణీయ సుందర ప్రకృతి చిత్ర ములు కన్నులకు గట్టి యెఱ్ఱన కవితా హృదయము మనకు సాక్షాత్కరింప జేయును.

ఎఱ్ఱన వ్యక్తిత్వము పూర్ణిమనాటి చంద్రునికివలె వంకలేనిది. శివభక్తుడు. అయినను గోవిందగుణాదర సంభృత సౌమనస్య ధన్యుడు! సరస బహుపురాణ ధర్మశాస్త్ర కథా విస్తరవేది. వినయోదయ భరితుడు. అతులానుభావ భవ్యుడు. ఇట్టి వ్యక్తిత్వము గలిగినవాడు గనుకనే నన్నయ తిక్కనలు వదిలిన భారతారణ్య పర్వశేషమును బూరించి కవిత్రయములో తృతీయునిగా ప్రసిద్ధిగాంచెను. ఇంతియే గాక ప్రబంధ కవితారీతికి వైతాళికుడై, కావ్యజగత్తునకు

మార్గదర్శియై, యాంధ్రకవులకు బూజనీయుడై ప్రబంధ పరమేశ్వరుడుగా ప్రసిద్ధినొందినాడు ! ఆ మహనీయుని కవితాశక్తికి దావలమైన వ్యక్తిత్వము, వినయసంపద సకల కవిజన లోకమున కాదర్శప్రాయములు !

## ఎఱ్ఱన శైలీ సంపద

ఎఱ్ఱాప్రెగడ శైలి విలక్షణమైనదని పండితుల యభిప్రాయము. శైలి యనగా రచనా విధానము.

"ఎఱ్ఱన్న నాలుగైదు పద్ధతులుగా వ్రాయగల సామర్థ్యము కలవాడు. ఆయన హరివంశ రచన వేఱు. నృసింహ పురాణ రచన వేఱు. ఈయరణ్య పర్వరచన వేఱు. ఒక విధముగా చూచినచో నెఱ్ఱన్న తెలుగులో పద్యరచన పలు విధములుగా జేసి తరువాతి కవులకు మార్గదర్శకుడైనాడు."

శ్రీ విశ్వనాథ,
(సాహిత్య సురభి నుండి)

ఒక కవి యొక్క సాహిత్యము బహుకాలము పఠించుట వలనను, పదవాక్య భావాలంకార సౌందర్యములను బరికించుట వలనను నా కవి పద్యమిట్లుండునను స్ఫురణను గలుగజేయును. కాని యెఱ్ఱాప్రెగడ కవితాశైలి విచిత్రమైనది. గ్రంథములు మూడును త్రివిధ శైలీ రీతులలో నొప్పారుచున్నవి. దీనివలన నీ మహాకవి యెన్ని విధములైన, యేవిధమున నన్న నావిధముగా రచనసేయగల దిట్ట యని స్ఫురించుచున్నది.

భారతారణ్య పర్వశేషమున నన్నయ కవితా శైలిని పుణికి పుచ్చుకొని పూర్తి చేసెను. నిజమునకు నన్నయయే పుట్టుకవచ్చి యానాడు వదిలిన యరణ్య పర్వశేషమును బూర్తిచేసెనా యని యనిపించును.

హరివంశమునందు ఎఱ్ఱన నిగమాగమ శాస్త్ర మధుర వాక్య పదసౌందర్యము లడుగడుగున గోచరించుచుండును. ఎఱ్ఱన భావుకుడు. అతడేది ముట్టినను నది లోకోత్తర సౌందర్యములు వెలువరించు చుండును. ప్రతిపద్యమును కవితా సౌరభముతో రసానందము గలిగించు చుండును.

ఇంక నృసింహపురాణమున తన ప్రత్యేకకవితా శైలిని స్ఫురింప జేయుచు మోక్షవిద్యా మధుర ఫలరసములను మన కందించు చుండును. ఇందు ప్రత్యేకమైన ప్రబంధ శైలిలో గవితారచన గావించి, రాబోవు ప్రబంధ యుగమునకు మార్గ దర్శియై యొప్పెను. ఆంధ్ర ప్రబంధ కావ్యసరస్వతికి స్వాగత గీతముల నాలపించెను.

ఇంతకు బిండితార్థ మేమనగా నెఱ్ఱనకు ప్రత్యేకమైన శైలీ సంపద లేదనుట కంటె బహుముఖవిధ శైలీ సంపద గల వాడని చెప్ప వచ్చును. నేర్పరియైన విలుకాడు ధనుస్సు నెటు వంచిన యటు వంగునటుల, వశ్యవాక్కులైన ఋషుల వాక్కులు నెటుల బలికిన యటు లగునటుల యెఱ్ఱన్నగారి శైలీసంపద గూడ నిరుపమానము, అపురూపము!

# ఎఱ్ఱాప్రెగడ నాటి దేశకాల పరిస్థితులు

మహాకవి యెఱ్ఱాప్రెగడ రచనలను బరిశీలించుటకు ముందానాటి దేశకాలపరిస్థితులను బరిశీలింపవలసియున్నది. అటు పశ్చిమమునుండి వీరశైవమును, దక్షిణమునుండి వీరవైష్ణవమును తెలుగుదేశమున సంఘర్షణము పడుచున్న దినములవి. అట్టి సమయమునందా భీభత్సమును దొలగించి శాంతిని స్థాపించుటకు కవులే సూత్రధారులైనారని చెప్పు టతిశయోక్తి కాదు. అట్టి సమతా మమతలతో గూడిన సాధుపూరితమైన అద్వైతభావమును వ్యాప్తిజేయుటకు కవులే నడుము కట్టిరని భావింపవలసియున్నది.

ఈ యమృతవ్యాప్తి ఆదికవి నన్నయ భట్టారకుడు భారతాంధ్రీకరణముతో ప్రారంభమైనదని చెప్పవచ్చును. నన్నయ్య రచించిన యా రెండున్నర పర్వముల భారతాంధ్రీకరణమే తెలుగుదేశపు జీవనస్రవంతి యని చెప్పవచ్చును. ఆ రెండున్నర పర్వములే యానాటి విశృంఖల శక్తులను రూపుమాపి, సంకుచిత మతాభిమానములకు స్వస్తి చెప్పించి, విశాలభావములకు, ఉన్నత జీవనవిధానమునకు దిక్సూచియై తెలుగుజాతిని చైతన్య మొనర్చినది.

తెలుగుజాతి నన్నయ భారతమును మనసార స్వీకరించి, స్వాగత మొసగినది. అందు లీనమైనది.

తరువాత తిక్కన్నగారు కూడ శివకేశవపర భేదములు లేకుండ హరిహరనాథుని సృజించి, యద్వైత భావ సిద్ధాంత

మునకు దృఢమైన పునాదులనువేసి కుడ్యముల నిర్మించెను. తరువాతి కవులైన ఎఱ్ఱన పోతనలు తాము శివభక్తులైనను అద్వైత భావసిద్ధికిఁ బాటువడిరి. బాటలు వేసిరి.

కవిసార్వభౌమ శ్రీనాథ మహాకవి వంటివారు శైవ భక్తి ప్రాధాన్యముగల గ్రంథములు, అష్టదిగ్గజ కవులలో గొందఱు వైష్ణవభక్తి ప్రాధాన్యముగల గ్రంథములు రచించినప్పటికిని అద్వైత భావ జీవన స్రవంతికి నాటంకములుగా లేవు. తద్భావ వ్యాప్తికి, విస్తరణకు దోహదకరములేయని భావింపవలసియున్నది.

ఎఱ్ఱన శంభుదాసుడైనప్పటికి విష్ణుకథా ప్రశస్తములైన గ్రంథములను రచించి శివకేశవభేదములేని అద్వైత భావవ్యాప్తికి దోడ్పడెను. శివకేశవభేదములతో నల్లకల్లోలముగా నున్న నాటి సామాజిక పరిస్థితులను దారి మళ్ళించి సమాజమును అద్వైత మార్గమున నడిపించుటకు కవులే కంకణధారణమునుజేసి నేతృత్వము వహించిరనుట నిస్సందేహము.

## ఎఱ్ఱన్నగారి రచనలు

కవిత్రయములో తృతీయులైన యెఱ్ఱాప్రెగడ రచించిన గ్రంథములు కొలదియేయైనను నవి యాంధ్రభాషా సరస్వతికి ముత్యాల ముప్పేట హారముబోని ప్రకాశించుచున్నవి. ఎఱ్ఱన్న యీ క్రింది గ్రంథములు రచించినట్లుగా దెలియుచున్నది.

1) సంక్షేప రామాయణము
2) భారతారణ్యపర్వశేషము
3) నృసింహ పురాణము
4) హరివంశము

ఎఱ్ఱాప్రెగడ రచించిన సంక్షేప రామాయణము ప్రస్తుత మలభ్యగ్రంథము. సంక్షేపరామాయణము నందలి పద్యములని ఆనంద రంగరాట్ఛందమున కొన్ని పద్యము లాహరింపబడినవి. కొంద ఱీ రామాయణమునందలి పద్యములు భాస్కర రామాయణము నందు గలిసిపోయిన వందురు. ఈసంక్షేపరామాయణ పాతప్రతు లెచ్చటనైనా నున్నవేమో పరిశోధింపవలసియున్నది.

ఎఱ్ఱనకు బూర్వమే భాస్కరరామాయణము, రంగనాథ రామాయణము మున్నగునవి లిఖింపబడినవి. మఱి ఎఱ్ఱన సంక్షేపముగా రామాయణము రచించుటకు గారణ మేమి? మల్లారెడ్డి ప్రోద్బలము వలన యని మనము భావింప వలసియున్నది.

వేమారెడ్డిసోదరుడు మల్లారెడ్డి. సేనాని. అన్నకు గుడిభుజము. సాహితీప్రియుడు. అతడు గుండ్లకమ్మనది యొడ్డున గల చెదలువాడయందు రామలక్ష్మణుల గుడి గట్టించుచు న్నాడు. విగ్రహప్రతిష్ఠా సమయమున వేమభూపాలుడుకూడ రావచ్చును. అతనికి ఎఱ్ఱన కవితను వినిపించి, ఎఱ్ఱనకు ఆస్థాన ప్రవేశమును గలిగింపవలెనను కోరికతోడనే సంక్షేపరామాయణమును కొద్ది కాలమునందు రచింప గోరెను గాబోలు! అందువలననే ఎఱ్ఱయ సంక్షేపముగా రామాయణమును రచించి యుండవోపు!

అట్లే విగ్రహ ప్రతిష్ఠాసమయమున ఎఱ్ఱయ వేమ భూపాలునికి సంక్షేపరామాయణమును వినిపించినాడు. రాజు ముగ్ధుడైనాడు. ఎఱ్ఱయ కాస్థానప్రవేశము గలిగినది.

ఎఱ్ఱయ రామాయణమును సంక్షేపముగా రచించుట చేతను, దానికి ఘన ప్రాధాన్య మొసగకుండుట చేతను నది కాలగర్భమున గలిసిపోయి యుండవచ్చును. కాని యా సంక్షేప రామాయణ ప్రభావము చేతనే వేమభూపాలుని మన్ననలను, ప్రశంసల నంది రెడ్డిరాజుల యాస్థానకవిగా ఎఱ్ఱయ ప్రఖ్యాతిగాంచెను.

## 2. భారతారణ్య పర్వశేషము

ఆదికవియైన నన్నయభట్టారకుడు వ్యాసభారతమును ఆనాడు వేగీదేశమును పాలించుచున్న రాజరాజనరేంద్రుని ప్రోద్బలమున నాంధ్రీకరింప మొదలిడెను. ఆది సభాపర్వము లను బూర్తిచేసి, యరణ్యపర్వమున గొంతభాగము రచించి యదృశ్యుడాయెను. ఇది పదునొకండవ శతాబ్దమున జరిగిన సంగతి.

తరువాత పదుమూడవ శతాబ్దమున మనుమసిద్ధి యాస్థానకవి తిక్కన సోమయాజి భారతరచనకు బూనుకొని యరణ్యపర్వశేషమును బూర్తిచేయక విరాటపర్వము మొదలుకొని స్వర్గారోహణపర్వమువఱకు రచించి భారతాంధ్రీకరణమును బూర్తిచేసెను. కాని యరణ్యపర్వశేషమును మాత్రము పూరింపలేదు.

తరువాత పదునాల్గవశతాబ్దమున శంభుదాసుడైన ఎఱ్ఱయ నన్నయ వదిలిన యరణ్యపర్వశేషమును బూరించి

కవిత్రయములో నొకరుగా ప్రసిద్ధినందెను. త్రివేణీసంగమము నందు గంగా యమునా నదీ స్రవంతులకు మధ్య సరస్వతీ స్రోతస్సు శోభిల్లునటుల నన్నయ తిక్కనల కవితా ప్రవాహముల మధ్య ఎఱ్ఱన కవితా సరస్వతి శోభిల్లినది.

తన గురువైన శ్రీ శంకరస్వామి యాశీస్సులతో తండ్రి సూరన సహాయ సహకారములతో తన కోఱ కెదురు చూచుచున్న భారతారణ్య పర్వశేషమును బూరించి, ధన్యుడయ్యెను. అందుకు నన్నయ వఱవడిలో సుజనోత్సవ మొప్పగ నిర్వహించినాడు. కవిత్రయములో నొకరుగా, కావ్యజగన్నిర్మాతగా ఆంధ్ర ప్రజల ప్రస్తుతికి భాజను డైనారు.

## 3. నృసింహ పురాణము

శ్రీ లక్ష్మీనరసింహావతారమను పురాణ కథయందు పరమభక్తాగ్రేసరుడైన ప్రహ్లాదుని చరిత్రమును, అహోబల తీర్థ మహాత్మ్యమును ఇందు వర్ణింపబడినవి. పంచమాశ్వాసములతో వర్ధిల్లి ప్రబంధ ధోరణిలో విలసిల్లినది. బ్రహ్మాండాది పురాణాంతర్గతమగు కథయని చెప్పబడినను ప్రహ్లాద చరిత్రమును వివిధ పురాణములలో చదివినది "విన్నదీ కన్నదీ" తాను వ్రాయుచున్నానని యాగ్రంథమునందు యెఱ్ఱన్న చెప్పికొనెను.

ఈనృసింహపురాణమును ప్రబంధ రీతిలో రచించి నందువలననే యెఱ్ఱనకు ప్రబంధపరమేశ్వరుడను ఖ్యాతి గలిగినది. ఇందలి యెఱ్ఱన రచనావిధానము తెలుగు దేశమున

తెలుగు బాసకు ప్రబంధ కవితారీతికి నంకురార్పణము గావించినదని పండితుల నిశ్చితాభిప్రాయము. నృసింహ పురాణము మధురాక్షర వాక్య విన్యాసములతో గూడిన భక్తి రస ప్రబంధము.

## 4. హరి వంశము.

హరి వంశము భారత కథానంతర భాగమని చెప్పవచ్చును. విష్ణుకథా ప్రాశస్త్యముగల కథలతో కూడినది. ఈ గ్రంథమును తన యేలికయైన యనవేమ భూపాలునికి యంకిత మొనర్చినాడు.

అప్పటికి భాగవత మెవ్వరును రచించి యుండలేదు. మఱి యెఱ్ఱన్న యావంకకు నేలబోలేదో విచారింప వలసి యున్నది. వ్యాస భాగవతము ద్వాదశస్కంధములు గల మహా గ్రంథము. ఆ గ్రంథమును బూర్తి చేయుట కెంతయో సమయము కావలసి యుండును. అందు వలన త్వరలో బూర్తి చేయనగు హరివంశమును స్వీకరించి యుండవచ్చును.

వర్ణనాత్మకమగు తన కవితాశయ్యకు ననువదించుట యనునది తన కిష్టము కాదేమో! నన్నయ్య తిక్కన్నలు రచించిన భారతము రెండు ముక్కలుగా బడియున్న సమయమున, యే కవియును నా భారతము వంకకు జూచుటకు భయపడియున్న సమయమున తానీ సాహసయత్నమున కుపక్రమించినాడు! అరణ్య పర్వ శేషమును బూర్తి చేసి, యాంధ్ర భారతికి నడుమున కొడ్డాణమును హరివంశమును రచించి మణి కిరీటముతో నలంకరింపజేయ దలపెట్టినాడు.

మధ్యలో భాగవతము జోలి కేల బోవును? తాను దలపెట్టిన పనులను బూర్తిచేసినాడు! ఆంధ్రభారత భారతిని సర్వాంగ సుందరముగా, సమగ్రముగా తీర్చిదిద్ది తెలుగువారి కర్పించి నాడు.

ఎఱ్ఱన్న సంస్కృత హరివంశములోని కథలను తన ప్రబంధ కవితా శైలి ననుసరించి తీర్చి దిద్దినాడు! తనకు గల భాగవత భక్తిని వెల్లడించుకొనినాడు? ఈ హరివంశము తన యేలిక కంకిత మొనర్చి చరిత్రలో తన ప్రభువునకు స్థానమును కల్పించినాడు!

రామాయణము గాక పై మూడు గ్రంథముల వల ననే ఎఱ్ఱన్న కవిలోకవంద్యుడై యాతని కవిత చిరస్థాయి యైనది. ఆ మహాకవి మూడు గ్రంథములును ఆంధ్ర భాషా సరస్వతి కంఠహారమున ముప్పేట ముత్యాల హారమువలె యత్యంత శోభాయమానముగా నేటికిని ప్రకాశించు చున్నవి. ఎఱ్ఱన ధన్యుడు! ఆతనిని బోషించిన రెడ్డిరాజు లును ధన్యులే!

## ఎఱ్ఱాప్రెగడ రచనలు - పౌర్వాపర్యములు

శంభుదాసుడైన ఎఱ్ఱాప్రెగడ రచించిన నాలుగు గ్రంథములును ఎప్పుడెప్పు డేదిముం దేది వెనుక రచించెనో కొంత వివాద గ్రస్తమైనను విచారింతము. కొంతమంది కవులు తాము వ్రాసిన గ్రంథములను ముందు వెనుకలుగా

బ్రకటించుచుందురు. ఎఱ్ఱన్నగారి విషయమునందట్టిదేమైన జరిగినదేమో విచారింపవలసి యున్నది.

ఉ॥ ఉన్నత సంస్కృతాది చతు
రోక్తి పదంబులఁ గావ్యగర్త పై
యొన్నికమైఁ బ్రబంధ పర
మేశుఁ డనంగ నరణ్య పర్వశే
షోన్నయ మంధ్రభాష సుజ
నోత్సవ మొప్పఁగ నిర్వహించి తా
నన్నయభట్ట తిక్కకవి
నాథుల కెక్కిన భక్తి పెంపునన్ !

ఈ పద్యము నృసింహ పురాణము పీఠికలోనిది. ఎఱ్ఱాప్రెగడ పితామహు డెఱ్ఱపోతన్న భావంబున నావిర్భావంబునొంది పలికిన పలుకులు. దీని వలన నృసింహ పురాణము భారతారణ్య పర్వశేషము రచించిన తరువాతనే రచించినట్లు రూఢిగా జెప్పవచ్చును. మఱి సంక్షేప రామాయణము హరివంశము నేకాలమున రచించినట్లు ?

శా॥ నాతమ్ముండు ఘనుండు రథినీ
నాథుండు నిన్నాతత
శ్రీతోడన్ సముపేతుఁ జేసి యోఁమిన్
జేపట్టి మాం కిచ్చుటన్
జేతోమోద మెలర్ప రామకథ మున్
జెప్పించి యత్యుత్తమ
ఖ్యాతిం బొందితి నింకనుం దనియఁ నే
గావ్యామృత స్వాదనన్

ఈ పద్యము హరివంశము నందలి పీఠికలోనిది. వేమ భూపాలుడు ఎఱ్ఱన్నగారితో బలికినది. ఇది వఱకు రామ కథను నీతో జెప్పించి, ఖ్యాతిని బొందితిని, ఇంకను కావ్యామృత స్వాదనమందు దనియలేదని చెప్పికొనెను. దీని వలన హరివంశమునకు ముందు సంక్షేపరామాయణము రచించి నటుల స్పష్టమగుచున్నది.

మఱిప్పుడు భారతారణ్య పర్వశేషము తరువాత నృసింహపురాణమును, సంక్షేప రామాయణము తరువాత హరివంశమును రచించినటుల యూహమగుచున్నది. కాని యే రెండు గ్రంథముల తరువాత నే రెండు గ్రంథములు రచించెనో తెలియవలసియున్నది.

సూక్ష్మముగా బరిశీలించిన రామాయణము హరి వంశములకంటె ముందుగనే భారతారణ్య పర్వశేషమును, నృసింహ పురాణమును రచించినటుల మన మూహింప వచ్చును.

ఎఱ్ఱాప్రెగడ జన్మస్థానము గుడ్లూరునం దున్నపుడే గురువైన 'స్వామి మునీంద్రుడు భక్తజన వత్సలుడైన' శ్రీ శంకరస్వామి దయచేతను, 'అప్రతిమ మాహాత్మ్యోభయ కవిత్వప్రౌఢ శబ్దార్థ యోగాజ్ఞా సిద్ధిఘను'డైన' తండ్రి సూరన సహాయ సహకారములతోడను, భారతారణ్యపర్వ శేషమును బూర్తిచేసియుండవచ్చును.

ఇంతలో నెఱ్ఱన్నగారి పితామహుడు మరణించి యుండ వచ్చును. ఎఱ్ఱనకు పితామహుని యెడల మిక్కిలి

గౌరవాదరములు. ఆతని యాత్మశాంతికై నృసింహపురాణ
మును రచింప మొదలిడెనని భావింపవచ్చును.

ఈనృసింహ పురాణము బూర్తియగు వఱకు వేమ
భూపాలుని సోదరుడును, సాహితీ ప్రియుడునైన మల్లా
రెడ్డితో నెఱ్ఱనకు పరిచయ భాగ్య మబ్బియుండ వచ్చును.

మల్లారెడ్డి గుండ్లకమ్మనది యొద్దునగల చెదల్వాడ
యందు రామలక్ష్మణుల గుడి కట్టించినట్లును, ఈ చెదల్వా
డనే రెడ్డిమల్లవరమని నామకరణమును జేసి, దేవ భోగముగా
నాగ్రామమును దేవాలయమున కర్పించినట్లును రెడ్డిమల్ల
వరము శాసనము వలన దెలియుచున్నది.

ఈ రామలక్ష్మణుల గుడియందు విగ్రహప్రతిష్ఠా
సమయమునకు సంక్షేప రామాయణమును వేగముగా
రచింప నెఱ్ఱన్నను ప్రోత్సహించి, రచింపజేసి యాసమయ
మున యనవేమభూపాలునికి వినిపింపజేసినట్లును, రాజు
ముగ్ధుడై యెఱ్ఱన్నగారిని యాస్థానకవిగా స్వీకరించినట్లును
మన మూహింపవచ్చును. తరువాత నీ మహాకవి హరివంశ
మును రచించి తన యేలికకు నంకిత మిచ్చిన విషయము
జగత్ప్రసిద్ధము.

ఇంతకు బిండితార్థమేమనగా నెఱ్ఱన్నగారు రచించిన
గ్రంథముల నీ విధముగా వరుస క్రమమును సూచించుట
దోసము గాదు!

(1) భారతారణ్య పర్వశేషము
(2) నృసింహ పురాణము
(3) సంక్షేప రామాయణము
(4) హరివంశము

# నృసింహ పురాణ రచనకు కారణములు

ప్రబంధ పరమేశ్వరుడైన యెఱ్ఱాప్రెగడ నృసింహ పురాణమునందాశ్వాసాంత గద్యాలలో 'లక్ష్మీ నరసింహావతారమను పురాణకథ' యని పేర్కొనెను. అదియే నృసింహ పురాణముగా లోకప్రసిద్ధినందెను. అహోబలక్షేత్రమున శ్రీ నృసింహ దేవుడు లక్ష్మీదేవితో గూడియుండెను గాబోలు! అట్టి యా దేవు నా పేరుతోనే పేర్కొని కబ్బమును నిర్మించెను.

ఒకనాడెఱ్ఱన్న 'మహాప్రబంధ కల్పనా కుతూహలాయత్త చిత్తముతో సమాహితుడై యున్నప్పు డెఱ్ఱపోతన్న యాతని భావంబున నావిర్భావంబునొంది సదయానంద మధుర వాక్యముల నిట్లనుగ్రహించెనని నృసింహ పురాణ మందలి పీఠికలో గలదు.

ఉ॥ ఉన్నత సంస్కృతాది మధు
రోక్తి పదంబుల కావ్యకర్త పై
యెన్నికమైం బ్రబంధ పర
మేశుండనంగ నరణ్యపర్వ శే
షోన్నయ మంత్రభావ సుజ
నోత్సవ మొప్పంగ నిర్వహించి నా
నన్నయభట్ట తిక్కకవినాథుల
కెక్కిన భక్తి పెంపునన్ !

కం॥ గిరిశపద భక్తి రసత
త్పరభావము కలిమిం శంభుదాసుం డనంగా

బరఁగియు గోవిందగుణా
దర సంభృత సౌమనస్య ధన్యుఁడ నెందున్ !

కం॥ కావునఁ బ్రబంధ రచనా
ప్రావీణ్యము నీకు సహజ పరిణత సిద్ధం
బై వెలసినది యొక కృతి
గావింప జగద్ధితంబుగా నే బనుతున్ !

ఉ॥ శ్రీ మదహోబలేశ నర
సింహుఁడు నా ప్రియ దైవతంబు, మ
త్స్వామి, తదీయ తీర్థవిభ
వంబును దన్మహితావతారమున్
నీ మధురోక్తి గుంభన మ
నీషులు మెచ్చఁగఁ బ్రస్తుతింపు నీ
కే మెయి సంభవించు నఖి
లేప్సిత పుణ్య ఫలోదయోన్నతుల్ !

ఈ విధముగా తన పితామహుఁడెఱ్ఱపోతన్న తనాజ్ఞా పించుటచే, నదియే తనకు నీశ్వరానుశాసన మయ్యెనని పీఠికలో జెప్పికొనెను. అందులకే యెఱ్ఱయ నృసింహావతారమును స్తుతించు విధముగా అహోబల తీర్థమహాత్మ్యమును కృతియొనరింతునని పలికెను.

ఎఱ్ఱయకు దన పితామహుని యెడగల శ్రద్ధాభక్తులీ క్రింది పద్యము వలన దెలియుచున్నది.

చ. ననుఁ దన పేరివాఁడని మ
నంబున నెప్పుడు నాదరించుటన్

బనిచె గుణప్రసిద్ధియును
భవ్యసమృద్ధియుఁ జేరు పుణ్యపుం
బనియఁట ! మత్పితామహుఁడు
ప్రాక్తనసంయమి తుల్యవర్తనుం
డనఘు యశుండు పూర్ణపురు
షాయుష జీవిత ధన్యుఁ డిమ్మహిన్ !

గీ॥ అమ్మహాత్ముఁడు నిత్యదయార్ద్ర హృదయుఁ
డతులితానంద జలధి నోలాడుఁ గాత !
విష్ణుధర్మ ప్రశంసా పవిత్రమైన
యస్మదీయ ప్రబంధసామగ్రి వలన.

పితామహుని యెడ యెఱ్ఱయకుగల శ్రద్ధాభక్తులీ పద్యముల వలన దెలియుచున్నది. ఆయన కోరికను దీర్చుటకే పుణ్యప్రబంధ రచనకు బూనుకొనినాఁడని యూహింప వచ్చును.

భారతారణ్య పర్వశేష రచనానంతరము యెఱ్ఱయ గారికనేక కష్టనష్టము లెదురై యుండియుండవచ్చును. పితృపితామహుల యస్తమయము, కొన్ని ఈతిబాధలు సంభవించి యుండవచ్చును. అందులకే సర్వభయాపహారణమును, సకల బాధాపహరణమునునైన శ్రీ లక్ష్మీ నరసింహ దేవుని భజించి యుండవచ్చును.

అట్టి సమయమున మల్లారెడ్డివంటి సాహితీప్రియుఁడు యెఱ్ఱయగారికి దొరుకుట తెలుగువారి యదృష్టమని చెప్ప వచ్చును. ఈతని యాదరము వలననే రాజాస్థాన ప్రవేశము

జరిగినదని మఱచిపోరాదు. తాను ముందుగా నెఱ్ఱయగారిని యాదరించి, సత్కరించి అన్నగారి కీ కవిని యర్పించెను.

నన్నయ తిక్కనలు వదిలిన భారతారణ్య పర్వశేష మును బూర్తిచేసి తన కవితా శక్తిని యున్నత పథములకు గొనిపోయిన యెఱ్ఱయ యిట్టి స్థలపురాణ మేల రచించెనని ప్రశ్నింతురు.

భారతారణ్య పర్వశేషమును బూర్తిచేసిన తరువాత తనను చుట్టుముట్టిన కష్టములను తొలగించు కొనుటకు తన కును, తన పితామహునకు నారాధ్య దైవమైన యహోబల దేవుని దివ్యగాథను రచించుటకు బూనుకొనెను. లోకము కొఱకు భారతారణ్యమును రచించెను. తన పితామహుని యాత్మ శాంతికొఱకును తన ప్రాదేశిక జనుల కీ బహుకృతి నిచ్చి సంతోషింప జేయుటకు నృసింహ పురాణము రచించె నని చెప్పవచ్చును. నృసింహ పురాణ రచనకు కొన్ని కార ణముల మన మూహింపవచ్చును.

1) ఎఱ్ఱన గిరిశపద భక్తిరస తత్పరభావము గలిగినను గోవింద గుణాదర సౌమనస్య ధన్యుడు! అహోబల దేవుని యెడ ఎఱ్ఱనకు చిన్ననాటి నుండియు భక్తి ప్రపత్తులు గలిగి యుండవచ్చును. ఆ దేవుని తిరునాళ్ళకును, వసంతోత్సవముల కును ప్రతి సంవత్సరమును బోయి వచ్చుచుండెడి వాడేమో! ఆ దేవుని ముద్ర తన హృదయముపై చెఱగనిదై యీ పురాణ ప్రబంధ రచనకు దారితీసెనేమో!

2) తనకువలె తన పితామహునకును అహోబల దేవు డారాధ్య దైవము. అందువలన యెఱ్ఱన తన కవితాశక్తిచే

నా దేవుని గీర్తించి పితామహుని యాత్మకు శాంతిని జేకూర్ప దలచి యీ పురాణ గ్రంథ రచనకు బూనుకొని యుండ వచ్చును.

3) తనకు గాబోవు నేలిక వేమ భూపాలుడు! అతడా దేవుని గుట్టకు కాలిబాటకు మెట్లు గట్టించి కృతార్థుడగు చున్నాడు. అనేక కానుకలను, దేవభోగముల నర్పించి ధన్యుడగుచున్నాడు. అట్టియెడ తానుగూడ నా దేవుని దివ్యగాథను కవితాగానము చేసి ధన్యుడగుటకు నీ కార్యమునకు బూనుకొనినాడేమో !

4) ఒక వ్యక్తి యెంతటి గొప్పవాడైనను లోకముచే నెన్ని ప్రశంసల నొందినను, దా బుట్టిన ప్రాంతమునకును, తన నివాస పరిసర జనుల కేదో యొక మేలుగావించి వారి మెప్పు నందుటకు యత్నించు చుండును. అట్టి కీర్తికాంక్ష నాకాంక్షించి, యీ కృతి నిర్వహణమునకు బూనుకొని నాడేమోనని యూహింపవలసి యున్నది.

5) ప్రహ్లాదుడు పరమభక్తుడు. అతని పావన చరిత్రను తెనుగునాట యింటింటను జెప్పికొందురు. నాడే కాదు నేడు గూడను ! అట్టి పావనమైన చరిత్రమును ఎఱ్ఱన్న పురాణములందు జదివెను. సంస్కృత భాగవతమునందు చదివెను. కథల నాలకించెను. వీధి భాగవతముల దిలకించెను. అందులకే ఎఱ్ఱన్న కన్నది, విన్నది, వ్రాయుచున్నానని పలికెను. కన్నది, విన్నది, చదివినది, హృదయమున గాఢ ముద్రను వేయగా నదియే ఎఱ్ఱన్నగారి వాగ్రూపమున వ్యక్తీకరింప బడినదని మనమూహింప వచ్చును.

ఇంకను మనమెన్నియో యూహింపవచ్చును. ఎఱ్ఱన రచించిన నృసింహ పురాణ మాంధ్రభాషా సరస్వతి కర్ణపూరాలంకారము. భక్తజనులకు దేవదేవుని జేరుటకు దివ్యసోపానము. కవిజన లోకమునకు కామితార్థ ప్రదాయిని. ఆ నాటి కవులకేకాదు, ఈ నాటి కవికుమారులకు గూడ నృసింహ పురాణమొక కల్పవృక్షము. కామధేనువు.

## ఎఱ్ఱాప్రెగడకు గల బిరుదములు

మహాకవి యెఱ్ఱాప్రెగడకు శంభుదాసుడు, ప్రబంధ పరమేశ్వరుడు అను రెండు బిరుదములు గలవు. ఈ బిరుదములు ఎఱ్ఱన్నగారి ఘనతకు నానుమాత్రములే యని చెప్ప వచ్చును.

'గిరిశపద భక్తిరస తత్పర భావము' అను పద్యము వలన ఎఱ్ఱన్న శివభక్తుడనియు, శివార్చనా తత్పరుడనియు దెలియుచున్నది. ఆతడేగాక యాతని కుటుంబమంతయు శైవభక్తి సాంప్రదాయులని తెలియుచున్నది. అంతియగాక వీరి గురువు శ్రీ శంకరస్వామి సంయమీశ్వరుడు నిత్య శివరాత్రి వ్రతుడగు శైవాచార్యుడు. ఈతనినే యెఱ్ఱన్న తన గురువుగా భావించి కీర్తించినాడు. అందువలన యెఱ్ఱన్నకు శంభుదాసుడను బిరుదము గలిగినదని భావింప వచ్చును. ఎఱ్ఱన్న విష్ణుభక్తి సాంప్రదాయములను ద్వేషించు వాడుకాడు. అద్వైత భావసుందరుడు.

ఎఱ్ఱన్నకుగల రెండవ బిరుదము ప్రబంధ పరమేశ్వరుడు. తెలుగున ప్రబంధయుగ కవితారీతికి యెఱ్ఱన్న వైతా

శికుడు ! ఎఱ్ఱన్నగారి రచనలలో ముఖ్యముగా నృసింహ పురాణమున రేఖామాత్రముగా సూచన ప్రాయముగా ప్రబంధ రీతిని, ప్రబంధ కవితా సామగ్రిని ప్రదర్శించి, వాని నెట్లుపయోగింపవలెనో మార్గదర్శి యైనవాడు యెఱ్ఱన్న. అందువలననే యెఱ్ఱాప్రెగడకు ప్రబంధ పరమేశ్వరుడను బిరుదము గలిగినదని భావింప వచ్చును.

## ఎఱ్ఱన్న రచనలు - అంకితము

ఎఱ్ఱాప్రెగడ రచనలు శిథిలమయిన సంక్షేప రామాయణమును దొలగించిన మూడు గ్రంథములేయని మనము భావింపవలసి యున్నది.

1) భారతారణ్యపర్వ శేషభాగము
2) నృసింహ పురాణము
3) హరివంశము

నన్నయ్య తిక్కనలు వదిలిన భారతారణ్య పర్వ శేషమును ఎఱ్ఱాప్రెగడ పూర్తిచేసి, భారతాంధ్రీకరణమునకు నన్నయ్యను బోత్సహించిన రాజరాజ నరేంద్రునకే యంకితమిచ్చెను. విరాటపర్వము మొదలు స్వర్గారోహణ పర్వమువఱకును పదునేను పర్వములు రచించిన తిక్కన హరిహరనాథున కంకిత మొనర్చెను.

మఱి యెఱ్ఱన్నగూడ తాను రచించిన భారతారణ్య పర్వశేషము నొకానొక రాజునకుగాని, తనయిష్టదైవమునకు

గాని యంకిత మొనర్పవచ్చునుగదా! అట్లేల సేయక యెన్నడో మూడు శతాబ్దముల క్రిందట గతించిన రాజరాజ నరేంద్రున కేల యంకిత మీయవలసి వచ్చినది? ఆలోచింప వలసిన విషయము.

నన్నయ్యగారు భారతారణ్య పర్వశేషమును దైవ వశమున వదలి వేయుట వలననే దానిని బూరించు భాగ్యము ఎఱ్ఱనకు గలిగినది-భారతారణ్య పర్వశేష రచనయందు నన్నయ్య యడుగుజాడలలో నడిచినవాడు. నన్నయ్య తన కవితాశక్తి నడిపింపగా నడిచినవాడు. నన్నయ్య తన భారతమును రాజరాజ నరేంద్రున కంకిత మొనర్చినాడు. తాను రచించినది నన్నయ్య వదలిన అరణ్యపర్వశేషమును మాత్రమే రచించినాడు. అట్టి స్వల్పభాగమును రచించి, మఱి యొక నరేంద్రునకుగాని లేదా తన ఇష్టదైవమునకుగాని యంకితమొనర్చుట ఎఱ్ఱన్నగారి మనసొప్పకొనలేదనిమనము భావింపవలసియున్నది. అందువలననే నన్నయ్య యంకిత మొనరించిన యా రాజరాజ నరేంద్రునకే తాను తెనిగించిన యరణ్యపర్వ శేషభాగము నంకిత మొనరించినట్టుల భావింపవలసి యున్నది.

ఇంక ద్వితీయ గ్రంథము నృసింహ పురాణము. దీనిని ప్రబంధశైలిలో దీర్చిదిద్దెను. నరాంకితము గావింపక తనకును తన పితామహునకు నిష్టదైవమైన యహోబలదేవున కంకిత మొనరించెను.

తనను ముందుగా సత్కరించి, రాజాశ్రయ మిప్పిం

చిన మల్లారెడ్డికి నంకిత మొనర్పవచ్చునుగదా! ఎఱ్ఱన యిట్లేల చేయలేదు? కారణమిదియని మన మూహింపవచ్చును.

తాను రచించినది స్థలపురాణముతో గూడిన భక్తి ప్రపత్తిని చరిత్రము. తన పితామహుని యాత్మశాంతికై రచించిన గ్రంథము. అట్టి కృతి నరాంకితమేల యొనర్చును? భగవదర్పితముగా శ్రీమదహోబల స్వామికంకిత మొనర్చి తన కవితా సుధాభిషేకములతో నర్చనలొనరించెను.

అట్లే హరివంశమును రచించి యెఱ్ఱన్న తన యేలికయైన వేమభూపాలున కంకిత మొనరించెను. మదోన్మత్తులయిన రాజులకు కావ్యము లంకిత మీయ వచ్చునా? ఇది యొక మీమాంస. అవును! నిజమే! మదోన్మత్తులైన రాజులకు కావ్యము లంకితమీయరాదు. కాని ఉత్తములైన సత్పురుషులకు కావ్యము లంకిత మిచ్చుట తప్పుకాదు గదా! రాజరాజ నరేంద్రునకు నన్నయ తన భారతము నంకితమిచ్చుట వలన యెట్టి కళంకమును రాలేదుగదా! అట్లే యల్లసాని పెద్దన్నకు తన మను చరిత్రమును శ్రీకృష్ణదేవరాయలకంకిత మిచ్చుట వలన ఎట్టి యపవాదము నందలేదు గదా!

ఈ వేమ భూపాలుడు గూడ నట్టివాడే! ప్రజా రంజకుడు! సత్పురుషుడు! సుగుణ భూషణుడు! పరాక్రమశాలి! దైవభక్తుడు! హిందూధర్మ సంరక్షణార్థము రాజ్యమును స్థాపించినవాడు! అట్టి సద్గుణశీలికి, తన కాశ్రయమిచ్చి, తన కవితా శక్తికి దోహదము చేసిన ప్రభువునకొక పాత్రము నంకిత మిచ్చిన దప్పేమి? ఎఱ్ఱాప్రెగడవంటి సుకవి కాశ్రయ మిచ్చి పోషించిన వేమభూపాలుడు నిజముగా ధన్యుడు!

ఈ విధముగా మహాకవి ఎఱ్ఱాప్రెగడ తాను రచించిన మూడు గ్రంథములను-భారతారణ్యపర్వశేషమును రాజరాజనరేంద్రునకును, నృసింహ పురాణమును అహోబలదేవునికిని, హరివంశమును దన యేలిక యనవేమభూపాలున కంకిత మొనరించెను.

యుక్తాయుక్త విచక్షణాను వివేకులు కోల్పోవరు గదా!

సంక్షేప రామాయణము ప్రస్తుత మలభ్యగ్రంథము- ఆ గ్రంథమును గూడ అనవేమభూపాలునకంకితమిచ్చెనేమో యని యీ క్రింది హరివంశము నందుగల పద్యము వలన అనుమానము గలుగుచున్నది.

ఉ॥ నా తమ్ముండు ఘనుండు రథినీ
నాథుండు నిన్నాతత
శ్రీ తోడన్ సముపేతుఁజేసి యొలమిన్
జేపట్టి మా కిచ్చుటన్
జేతోమోద మెలర్ప రామకథ మున్
జెప్పించి యత్యుత్తమ
ఖ్యాతిం బొందితి నింకనుం దనియు నే
గావ్యామృత స్వాదనన్!

అనవేమభూపాలునితో పరిచయముగలుగక పూర్వమే సేనాని, సోదరుడునైన మల్లారెడ్డితో పరిచయమై ఎఱ్ఱనను సత్కరించి, తన కర్పించినట్లును, మనస్సునకానందముగలుగునట్లురామకథను మున్నుజెప్పించి అత్యుత్తమఖ్యాతింబొందితి

సరియు, ఇంకను కావ్యామృతస్వాదనను దనియలేదని చెప్పి నట్లుగా గలదు.

"అత్యుత్తమ ఖ్యాతింబొందితి" అను వాక్యమువలన ఆ సంక్షేప రామాయణమును గూడ అనవేమభూపాలున కంకిత మిచ్చెనేమోయను అనుమానము గలుగుచున్నది. అంకితమొనర్పక పోయినను ఎట్లైన తన యేలికను కీర్తించి యుండవచ్చును. అత్యుత్తమ ఖ్యాతిని గలుగజేసిన యీ రామాయణము కాలగర్భమున కలిసిపోవుట విచారింపవల సిన విషయము, ఆ సంక్షేప రామాయణము లభ్యమయిన ఎన్నో చారిత్రక విషయములు తెలిసియుండెడివి.

## రెడ్డిరాజులు శైవులా ? వైష్ణవులా ?

రెడ్డిరాజ్యము క్రీ.శ. 1324 నుండి 1424 వఱకు వర్ధిల్లినట్లు తెలియుచున్నది. దీనిని స్థాపించినది ప్రోలయ వేమారెడ్డి. వీరిది దేసటి వంశము. ఇతని పూర్వులు కాక తీయులవద్ద క్షాత్రధర్మమును నిర్వహించినట్లుగా తెలియు చున్నది. కాకతీయ సామ్రాజ్య పతనానంతరము వీరు కృష్ణానదీ తీరమునగల తురుష్కుల నోడించి, ఆర్యధర్మ సంరక్షణార్థము రాజ్యము స్థాపించినటుల తెలియుచున్నది. వీరు నెల్లూరునుండి సింహాచలము వఱకుగల తీరప్రాంతము పాలించినట్లు తెలియుచున్నది. ఈ రెడ్డిరాజ్యము కొన్నాళ్ళ తరువాత చీలిపోయినప్పటికి నూరు సంవత్సరములు రాజ్య మేలినట్లు చరిత్ర చెప్పుచున్నది. వీరలనేక ప్రజాహిత కార్య

ములోనర్చినట్లుగను, కళలను బోషించినట్లు చరిత్ర సాక్ష్య మిచ్చుచున్నది. ఎఱ్ఱాప్రెగడ, శ్రీనాథ మహాకవి మున్నగు వారు రెడ్డిరాజుల యాస్థాన కవులుగా నుండుటయే వారల గొప్పతనము ఋజువగుచున్నది. వీరలు మొదట కొండ వీడును రాజధానిగా జేసికొనిరి. కావున వీరిని కొండవీడు రెడ్డిరాజులందురు. తరువాత వీరికి అద్దంకి రాజధానిగా నున్నట్లు చరిత్ర తెలుపుచున్నది.

అనవేమారెడ్డి తరువాత నతని కుమారుడు అనపోతా రెడ్డి క్రీ.శ. 1373 వఱకును పాలించినట్లు తెలియుచున్నది. అనపోతారెడ్డి కుమారుడు కుమారగిరి బాల్యావస్థలోనుండు దున అనపోతారెడ్డి సోదరుడు వేమారెడ్డి 11 సంవత్సర ములు కుమారగిరికి ప్రతినిధిగా పాలించినట్లు తెలియు చున్నది. తరువాత క్రీ.శ. 1383 నుండి క్రీ.శ. 1400 వఱకు కుమారగిరి పాలించినట్లు తెలియుచున్నది. తరువాత నతని కుమారుడు రాచవేమారెడ్డి నాలుగుసంవత్సరములుమాత్రమే పాలించినట్లు తెలియుచున్నది. తరువాత ఈ రెడ్డిరాజ్యము విజయనగర సామ్రాజ్యములో గలిసిపోయినట్లు తెలియు చున్నది.

తూర్పు తీరమున రాజమహేంద్రవరమునుండి సింహా చలము వఱకుగల ప్రాంతమును కాటయ వేమారెడ్డి క్రీ.శ. 1385 నుండి 1415 వఱకు పాలించినట్లు తెలియుచున్నది. తరువాత అల్లాడ వంశమువారు కొంతకాలము పాలించి నట్లును తుదకు విజయనగర సామ్రాజ్యమునందు జేరిపోయి

నట్లు తెలియుచున్నది. వీరిని రాజమహేంద్రవరపు రెడ్డి రాజులందురు.

ఎఱ్ఱాప్రెగడను తాను ముందుగా సత్కరించి, రాజాస్థాన ప్రవేశమును గల్పించిన మల్లారెడ్డి అతని వంశమువారు కందుకూరు ప్రాంతమును పాలించినట్లు గలదు. వీరు కందుకూరు రెడ్డిరాజులుగా ప్రసిద్ధి నొందిరి. తరువాత వీరుకూడ విజయనగర సామంత రాజులుగా నుండినట్లు చరిత్ర తెలుపుచున్నది.

ఇంతకును రెడ్డిరాజులు నూఱు సంవత్సరములు తీర ప్రాంతమును నెల్లూరునుండి సింహాచలము వఱకు పాలించిరి. ఈ రెడ్డిరాజులు శైవులా? వైష్ణవులా? ఈ విషయమును బరిశీలింపవలసి యున్నది.

ఈ రెడ్డిరాజులకు బూర్వులు కాకతీయులవద్ద క్షాత్ర ధర్మమును నిర్వహించినట్లు తెలిసికొంటిమి. కాకతీయులు శైవభక్తి సాంప్రదాయము గలవారు. వారనేక చోటులందు శివాలయములను గట్టించి, శివలింగములను ప్రతిష్ఠించినట్లు దృఢమైన యాధారములు గలవు. కాకతీయులు కట్టించిన దేవాలయములు చక్కటి శిల్పములతో నేటికిని తెలంగాణాము నందు గలవు. ఆ దేవాలయములందుగల శిల్పమును గాకతీయ శిల్పమందురు.

అంత మాత్రమున కాకతీయ ప్రభువులు వైష్ణవభక్తి సాంప్రదాయములను వ్యతిరేకించిరని భావింపరాదు. వారు కట్టించిన శివాలయములందు స్తంభముల పైనను, కుడ్యముల పైనను విష్ణుకథలకు సంబంధించిన యనేక శిల్పములుండును.

క్షీరసాగరమథనము, దశావతారములుమున్నగు విష్ణుకథలకు సంబంధించిన చిత్రములుండును. గర్భగుడి ద్వారమునందు మనకు గజలక్ష్మి ప్రత్యక్ష మగును.

ఈ రెడ్డిరాజులును కాకతీయులవద్ద సేనానులుగా నుండుటచే వీరును శైవభక్తి సాంప్రదాయము గలవారేనని భావింపవచ్చు. వీరును అచ్చటచ్చట శివలింగములు ప్రతిష్ఠించి యుండవచ్చును.

కాకతీయరాజ్య పతనానంతరము వీరు తరలివచ్చి కృష్ణానదీ తీరమున రెడ్డిరాజ్యమును స్థాపించిరి. ఆనాటి కాలమున పూర్వాంధ్ర దేశమున వైష్ణవమత ప్రాబల్య మెక్కువగా నుండెడిది కాబోలును! అంతేగాక దాపునగల విజయనగర సామ్రాజ్యమును బాలించుచున్న రాజులుగూడా వైష్ణవ మతావలంబకులే!

ఆ ప్రభావము రెడ్డిరాజులపై గూడ బడినది. అందులకు సాక్ష్యము అనవేమ భూపాలుడు అహోబలస్వామి గుట్టకు కాలిబాటను మెట్లు కట్టించుట. గుండ్లకమ్మ నది యొడ్డున రామలక్ష్మణుల గుడి కట్టించుట, ఎఱ్ఱాప్రెగడచే విష్ణుకథా ప్రశస్తములైన గ్రంథములను నిర్మింపజేయుట గమనింపదగినది.

ఈ రెడ్డిరాజులు వైష్ణవ శైవమత సాంప్రదాయముల రెండింటిని బోషించినట్లును, శివకేశవ భేదము లేనివారనియు శాసనముల వలనను, జరిత్ర వలనను దెలియుచున్నది.

మిర్యాలగూడ తాలూకా వాడపల్లివద్ద కృష్ణానది కిద్దరిని అగస్త్యేశ్వర దేవాలయమున ఒక శిలాస్తంభము

గలదు. అనపోతారెడ్డి సోదరుడు వేమారెడ్డి యీ శిలా స్తంభమును వెలయించినట్లు గలదు. అందు వేమారెడ్డి బ్రాహ్మణుల కనేక దానధర్మములు జేసినట్లుగలదు. ఈ ప్రదేశ మప్పుడు కొండవీటి రాజ్యమున నెట్లు జేరినదో తెలియకున్నది.

ఇంతకు నీ రెడ్డిరాజులు మొదట శైవమత సాంప్రదాయము గలవారనియు, తరువాత తీరప్రాంతమునగల వైష్ణవమత సాంప్రదాయ ప్రభావము వీరిపై బడినదని భావింపవచ్చును. వీరు శైవ వైష్ణవ సాంప్రదాయములను రెండింటిని యాదరించిరనియు శివకేశవ భేదము లేనివారనియు దెలియుచున్నది. రెడ్డిరాజులు ధన్యులు! వారు పోషించిన కళలు, శిల్పములు, ఆలయములు నేటికిని కన్నుల పండువు సేయుచున్నవి. వ్రాయించిన కవితలు నేటికిని ప్రతిధ్వనించుచు వీనులవిందు సేయుచున్నవి.

## నృసింహ పురాణము
## పురాణమా ? ప్రబంధమా ?

ఎఱ్ఱాప్రెగడ రచించిన నృసింహ పురాణము—పురాణమా? ప్రబంధమా? ఇదియొక ముడివీడని మీమాంస. ప్రబంధ లక్షణములు గలవు కావున నిదియొక ప్రబంధమని కొందఱందురు. కవియే పురాణమని పేర్కొనినాడు. ప్రబంధమని వేఱుగా జెప్ప నేలయని మఱికొందఱందురు.

నిజమున కీగాథ పురాణములనుండియే గ్రహింపబడి నది. రచనా విధానము మాత్రము ప్రబంధ రీతిలో కొనసా గింపబడినది. ఎఱ్ఱయ యీ నృసింహ పురాణమును లక్ష్మీ నరసింహావతారమను పురాణ గ్రంథమనియు, కావ్య మనియు, ప్రబంధమనియు వ్యవహరించెను.

కం॥ ఇది యీశ్వరానుశాసన
ముదయోన్ముఖ మయ్యె నాకు నూర్జిత శుభసం
పద నొనరింతు ప్రబంధము
సదయ నృసింహావతార సంస్తవ సరణిన్ !

ఈ విధముగా గృతిని రచించుట యీశ్వరాను శాసన మనియు, తనకు చిర యశస్సు సంప్రాప్త మగు ననియు, లక్ష్మీనరసింహావ తారమను బురాణ కథను, ప్రబంధ రీతి గను, స్తుతించు విధము గను, గబ్బము నొనరింతునని యెఱ్ఱన పలికెను !

అయితే - యీ విధముగా మొదట యెఱ్ఱనయే ప్రబంధ రీతిలో రచించెనా ? అదివఱ కెవ్వఁడు నాకీతి కవన మును జేయలేదా ? యని ప్రశ్నింప వచ్చును. యెఱ్ఱన్నయే స్పష్టముగా జెప్పినది బరిశీలింతము.

ఉ॥ మించిన వేడ్కఁ వీనులకు
మిక్కుటమై మధువృష్టిగ్రమ్మ రా
యంచలు గూయ గ్రొంచమును
నావలఁ గూయఁ గడంగుభంగిఁ బ్రౌ
ఢాంచిత శబ్ద సారులు మ
హాకవు లాద్యులు కావ్యశయ్య గీ

లించిన కీర్తిసంగ సుఖ లీలకు
నేనును గాంక్షఁ జేసితిన్ !

శబ్దసారులు, మహాకవులు, ఆద్యులునైన నన్నయ్య తిక్కన్నలు రచించిన కావ్యశయ్యా రీతి ననుసరించి నేనును వ్రాయుదునని యెఱ్ఱన పలికెను.

సూక్ష్మముగా బరిశీలించిన నన్నయ్య తిక్కన్నలు రచించిన భారతాంధ్రీకరణమున్నదున్నట్లుగా రచింపలేదు. కొన్ని చోటులందు కుదించిరి. కొన్ని చోటుల విస్తరణము గావించిరి. ఎఱ్ఱన్న మఱికొంత ముందునకు బోయి శాస్త్రము లందు జెప్పినరీతి ప్రబంధ రచనా నిర్మాణమునకు సంకురార్పణము గావించెను.

ప్రబంధమనగా ప్రఖ్యాతమైన గ్రంథములోని స్వల్పాల్ప కథాంశమును గైకొని, కవి తన బుద్ధిబలముతో, మేధాసంపత్తితో, అష్టాదశవర్ణనములతో శృంగారరస భూయిష్టమై యొక రసవత్తరమైన వృత్తాంతము నిర్మించుట. ఉదాహరణకు ఆంధ్ర కవితా పితామహుడు అల్లసాని పెద్దన నిర్మించిన మను చరిత్రము, నంది తిమ్మన్న రచించిన పారిజాతాపహరణమును నట్టివే ! ఇట్టి కవితా కన్యకు దొనగున నాందీ గీతమును బాడినవాడు ఎఱ్ఱన్న. అందులకే నా మహాకవికి ప్రబంధ పరమేశ్వరుడను నామధేయము గలిగినది.

అదివఱకు గాసట బీసటగా నున్న తెలుగు భాసను నన్నయ్య, తిక్కన్నలు రూపకల్పనము జేసి జీవము బోసిరి. పదునొకండవ శతాబ్దమునుండి పదుమూడవ శతాబ్దము వఱకు బురాణయుగమని చెప్పవచ్చును. తెలుగు

కవులు పురాణములను ననువదించుట తోడనే సరిపోయి నది. స్వతంత్ర కావ్యనిర్మాణ యత్నము జరుగలేదు.

అట్టి యుగసంధిలో నెఱ్ఱాప్రెగడ, నన్నయ, తిక్కనలు వదిలిన భారతారణ్య పర్వశేషమును బూర్తిజేయుటయే గాక, యనువాద సాహిత్యమునకు దెనుగున భరత వాక్యము పలుకుటకు సమయ మేతెంచినదనియు, స్వతంత్ర కావ్య నిర్మాణమునకు దెనుగుబాస పెంపొందినదని యెఱ్ఱన్న భావించెను. అందుకు దగిన బాట నాంధ్రకవులకు జూపెను. కావ్యరచనా నిర్మాణమునకు కావలసిన ప్రబంధ సామగ్రి నాంధ్రకవులకు నందించెను. ఈ పద్యమును బరిశీలింపుడు—

తే॥ అమ్మహాత్ముడు నిత్య దయార్ద్ర హృదయుఁ
డతులితానంద జలధి నోలాడు గాత !
విష్ణుధర్మ ప్రశంసా పవిత్రమైన
యస్మదీయ ప్రబంధ సామగ్రివలన !

తాను రచించిన యీ నృసింహ పురాణమును బరిపూర్ణమైన కావ్యమనిగాని, ప్రబంధమనిగాని చెప్పికొనలేదు. ప్రబంధ సామగ్రి నందించుచున్నానని మాత్రమే పేర్కొనెను. ఈ గ్రంథమునం దట్టి ప్రబంధ సామాగ్రి యేమి గలదో పరిశీలింతము.

బ్రహ్మాండాది పురాణములలోగల స్వల్పాల్ప కథా భాగమును గైకొని, కొన్ని వర్ణనలను బ్రవేశపెట్టి రసవత్తర ఘట్టములను సంధానించి పంచమాశ్వాసములుగా గథను విస్తరించి వ్రాసెను. అష్టాదశ వర్ణనములు లేకపోయినప్పటికి, గొన్ని వర్ణనలుగలవు. శృంగారనాయకీ నాయకులు లేకున్నను

కొన్ని శృంగార ఘట్టములు గలవు. ఇష్టదేవతా నమస్కార ములు, పీఠిక, కృతికర్త ప్రశంస, ఆశ్వాసాంత గద్యలు గలవు. ఇందు కావ్యమునకు గావలసిన కావ్య సామగ్రి నందించెను.

ఈ మహాకవి యందించిన కావ్యసామగ్రిని గైకొని శ్రీనాథాది మహాకవులు మఱికొంత ప్రకాశింప జేసిరి. పదు నాఱవ శతాబ్దము వచ్చువఱకు ఎఱ్ఱన నాటిన పూల మొక్కలు తీగెలను వారి, కొమ్మల నల్లుకొని, పుష్పించి, తెలుగు కవితా వనమున సుగంధ పరిమళములను గుబాళింప జేసినవి.

ఇంతకు బిండితార్థ మేమనగా — నృసింహ పురా ణము ప్రబంధ రీతిలోనున్న పురాణగ్రంథము. బ్రహ్మాం డాది పురాణములలో నున్న స్వల్పాల్ప కథాభాగమును గైకొని, ప్రబంధ రీతిలో విస్తరించి వర్ణనాత్మకముగా వ్రాయబడినది. అందు పురాణరీతులు కొన్నియు, ప్రబంధ రీతులు కొన్నియు గలిగి నృసింహావతారమువలె నొప్పు చున్నది.



సహజ పాండిత్య శోభితుఁడు

# బమ్మెర పోతనామాత్యుఁడు

మన మింతవఱకు ఎఱ్ఱాప్రెగడ జీవిత కాలాదులను, రచనా విధానములను గుఱించి కొంతవఱకు దెలిసి కొంటిమి. ఇంక సహజ పాండిత్య శోభితుడు బమ్మెర పోతనామాత్యుని గుఱించియు, వారి భక్తిరస పూరితమైన కవితా విధానములను గుఱించి తెలిసి కొందము.

ఉ॥ ఇమ్మను జేశ్వరాధముల
కిచ్చి, పురంబులు వాహనంబులున్
సొమ్ములు కొన్ని పుచ్చుకొని
చొక్కి శరీరముఁబాసి, కాలుచే
సమ్మెట ప్రేటులంబడక
సమ్మతి శ్రీహరికిచ్చి చెప్పె, నీ
బమ్మెర పోతరాజొకడు
భాగవతంబు జగద్ధితంబుగన్ !

బమ్మెర పోతన తెలుగు దేశమున నాబాల గోపాలమునకు జిరపరిచితుడు. ఈ మహాకవి పద్యములు రానివారుగాని, విననివారుగాని తెలుగుదేశమున గానరారు. స్త్రీలు గూడ బాడుకొను చుందురు. పూర్వకాలమున భాగవతమునందలి పద్యములు కంఠస్థము గావించి, వేకువ ఝామునందు భక్తిభావమున బఠించుచుండెడివారు.

తెలుగు దేశమున బమ్మెర పోతన వలన కృష్ణ భక్తియు, గోపరాజువలన రామభక్తియు వ్యాప్తి జెందినదనిన నతిశయోక్తి కాదు. ఈ మహాకవి సంస్కృతమునగల వ్యాసభాగవతము నాంధ్రీకరించి, రాజుల కంకిత మొసర్పక

తన యిష్టదైవ మైన శ్రీరామ చంద్రున కంకిత మొన రించెను. కృషికర్మమును జేసికొనుచు, దారిద్ర్యము ననుభ వించుచు, శ్రీకైవల్య పథంబు జేరుటకునై జింతించుచు, కవితా గానమును జేసిన మహనీయుడు బమ్మెర పోతనా మాత్యుడు.

## పుట్టుక - నివాసము

బమ్మెర పోతనామాత్యుడు క్రీ. శ. 15వ శతాబ్దము నకు జెందిన వాడని పరిశోధకుల నిర్ణయము. సర్వజ్ఞ సింగ భూపాలునికి సమకాలికుడు. కవిసార్వభౌమ శ్రీనాథ మహా కవి పోతన్నగారి బంధువుగా జెప్పుదురు. అదెంతవఱకు నిజమో తెలియదు. కాని కొంచె మించుమించుగా సమకా లీనుడని భావింపవచ్చును. శ్రీనాథ మహాకవి సర్వజ్ఞ సింగ భూపాలుని యాస్థానమున కేగునపు డీ పద్యమును బఠించి నటుల జెప్పుదురు.

గీ. ఎటుల మెప్పించెదో నన్ను నింక మీఁద
రావు సింగమహీపాలు ధీవిశాలు!
నిండు కొలువున నెలకొని యుండి నీవు
సరస సద్గుణ నికురుంబ! శారదాంబ!

కావున నీ ముప్పురును కొంచె మించు మించు నొక్కే కాలమునకు జెందిన వారని యూహింపవచ్చును. పోతన్న కవిత్రయములో నొకరైన యెఱ్ఱయ కంటె నొక శతాబ్దము తరువాత జీవించి యుండెనని భావింపవచ్చును.

ఈ మహాకవి నివాస స్థానమును గుఱించి కొంత వివాదముగలదు. 'ఏకశిలా నగరమునకుం జనుదెంచి' అని పోతన్నగారు తన నివాసమును గుఱించి పేర్కొనిరి. ఈ ఏకశిలా నగరమెచ్చట గలదో తెలియదు. కొందఱు ఓరుగల్లు ప్రాంతమున గల బమ్మెర గ్రామము నివాస స్థానమనియు కొందఱు కడప మండలమునగల 'ఒంటిమెట్ట' నివాస స్థానమనియు బేర్కొందురు. ఏమైనను బమ్మెర పోతన మన తెలుగువాడు. ఆంధ్రదేశమున జన్మించి, యాంధ్రభాషా సరస్వతికి వెలలేని యమూల్యాభరణమును సమకూర్చిన మహనీయుడు.

బమ్మెర పోతన కవిలోకమంతటికిని యాదర్శప్రాయమైనవాడు. కలమును, హలమును చేబట్టి దారిద్ర్యమును స్వీకరించిన మహామనీషి. పోతరాజునకు సాటి పోతరాజే యని యనిపించుకొని, పండితపామరజనులను భక్తి రస ప్రవాహమున నుఱ్ఱూతలూగించి, పరుగులెత్తించినవాడు. ఆబాల గోపాలమున కందాల పాటల వందించినవాడు. అట్టి మహనీయుడు తెలుగుదేశమున బుట్టి తెలుగున కవిత నల్లుటచే తెలుగుదేశము, తెలుగుభాష ధన్యములైనవి. ఉత్తర భారతదేశమున తులసీ రామాయణమునువలె తెలుగుదేశమున పోతన భాగవతమును బూజింతురు. భాగవత సప్తాహములు జేయుదురు. అట్టి మహనీయుని కివే పుష్పాంజలులు!

# పోతన్నగారు - అతని వంశీకులు

ఈ క్రింది పద్యమువలన పోతన్నగారి వంశవృక్షము తెలియుచున్నది.

సీ॥ కౌండిన్యగోత్ర సంకలితుఁ డాపస్తంబ
సూత్రుఁడు పుణ్యుండు సుభగుఁడైన
భీమన మంత్రికిఁ బ్రియపుత్రుఁ డన్నయ
కలకంఠి తద్భార్య గౌరమాంబ!
కమలాప్తు వరమునఁ గనియె సోమనమంత్రి
వల్లభ మల్లమ వారి తనయుఁ
డెల్లన, యతనికి నిల్లాలు మాచమ
వారి పుత్రుఁడు వంశవర్ధనుండు!

ఆ॥ లలితమూర్తి బహుకలానిధి కేసన
దానమాన నీతి ధనుఁడు ఘనుఁడు!
దనకు లక్కమాంబ ధర్మగేహిని గాఁగ
మనియె శైవ శాస్త్ర మతముఁ గనియె!

పై పద్యము వలన బమ్మెర పోతన్నగారిది కౌండిన్యస గోత్రమనియు, నాపస్తంపసూత్రమనియు తెలియుచున్నది. పోతన్న వంశకర్త భీమన మంత్రియని తెలియుచున్నది. భీమన మంత్రికి అన్నయ, అన్నయకు సోమనమంత్రి, సోమ మంత్రికి యెల్లన, యెల్లనకు కేసన జన్మించినట్లు వంశ వృక్షము దెలియు చున్నది. కేసన కుమారుడు మన పోతనా మాత్యుడు. తల్లిపేరు లక్కమాంబ.

పోతన్న తండ్రిని గీర్తించుచు, లలితమూర్తియనియు, బహుకలానిధియనియు, దాన మాన నీతిధనుడు ఘనుడనియు గీర్తించెను. మాతృమూర్తిని గీర్తించుచు

ఉ॥ మానిను లీడుగారు బహు
మాన నివారిత దీన మానస
గ్లానికి దాన ధర్మమతి
గౌరవ మంజులతా గభీరతా
స్థానికి ముద్దుసానికి స
దాశివ పాద యుగార్చనానుకం
పానయ వాగ్భవానికిని
బమ్మెర కేసయ లక్కసానికిన్!

పైపద్యమువలన పోతన్నకు తల్లిదండ్రులయెడ నెంత గౌరవాదరములుగలవో స్ఫురించుచున్నది. తనకు తిప్పన యను నగ్రజాతుడు గలడనియు, నత డీశ్వర సేవా కాముడనియు పీఠికయందు జెప్పికొనెను.

పోతన్నగారి వంశవృక్షము బరిశీలించిన వారి వంశము నందు కవిపండితులున్నట్లు గోచరింపదు తండ్రిని మాత్రము లలితమూర్తి, బహుకలానిధియనిపేర్కొనెను. బహుకళలలో గవితాకళగూడ నున్నదేమో తెలియదు.

పోతన తన పూర్వులను 'మంత్రి'యని వ్రాకుచ్చుటచే వారా నాటి చిన్నచిన్న రాజులకు మంత్రులుగా నుండిరేమో తెలియదు. ఆ రాజుల సంగతులు దెలియుటచేతనే పోతన్న తన గ్రంథమును వారి కంకింత మిచ్చుటకు నిరాకరించెనేమో!

## పోతనామాత్యుని భాగవత రచనకు కారణములు

ప్రసిద్ధుడైన యొకవ్యక్తినిగుఱించి లోకములోన నేకములైన యతిశయోక్తులు వ్యాపించియుండును. కొన్ని ప్రశంసాపూర్వకముగానుండును. కొన్ని దుష్టములైనవి. నిష్కళంకుడైన యుత్తమ శీలవంతునిపై కూడ బురదను జల్లి యపఖ్యాతిని వ్యాపింపజేయుదురు. అట్లే రాజులపైనను, కవిరాజులపైనను గాటుకను బూయుదురు.

అట్లే కవిసార్వభౌమ శ్రీనాథ మహాకవిపై నెవరో వ్రాసిన బూతు పద్యములనంటగట్టి, శ్రీనాథమహాకవిని వేశ్యాలోలుడనియు, శృంగార ప్రియుడనియు నిందించిరి.

అట్లే మహాకవి తెనాలి రామకృష్ణకవిపై గూడ ననేకములైన కథలు–గాథల నంటగట్టి, యాతని హాస్యచతురతను మంటగలిపిరి. ఆ మహాకవులు వ్రాసిన మహనీయ గ్రంథమును బఠించియు, వారల తత్త్వములను గ్రహించియు వారలపై కాటుక పూయుట న్యాయమా?

అట్లే సహజ పాండిత్యశోభితుడు, మహాభక్తుడు ఉత్తమశీల సంపన్నుడు, శ్రీకైవల్య పథంబు జేరుటకునైచింతించు మహనీయుడు పోతన్నగారు భోగినీ దండకము రచించినట్లు చెప్పుదురు. ఇదెంతటి యపవాదము!

పోతన్న వీరభద్ర విజయమునుగూడ రచించెనందురు. ఈ మహాకవిని గుఱించి యెన్నియో కథలు–గాథలు తెలుగు దేశమున వ్యాప్తములై యున్నవి.

పోతన్న సహజ పాండిత్య శోభితుడు. పరమేశ్వరాను గ్రహమున బాండిత్యమును సంపాదించినవాడు. భాగవత రచనకు గల కారణముల పోతన్న తన భాగవత గ్రంథ పీఠిక యందు జెప్పికొనెను. వానిని బరిశీలింతము.

పోతనామాత్యుడు శ్రీమన్నారాయణ కథా ప్రపంచ రచనా కుతూహలుడై యున్న సమయమున చంద్రగ్రహ ణముతో గూడిన పూర్ణిమా దివసమున గంగకు బోయెనట! అచ్చటకుంజని గ్రుంకులిడి జపతపానుష్ఠానములు జరిపి, పులిన తలంబున ధ్యానమగ్నుడై యున్న సమయమునందు బోతనకు శ్రీరామచంద్రుడు సీతాదేవితో గూడ బ్రత్యక్షమై భాగవతమును తెలుగుసేసి మన్నామాంకితముగా నర్పణసేయుమని యాజ్ఞాపించెనట! పోతన కనులు తెఱచి తన మనస్సునందు నీ విధముగా భావించెనట.

కం॥ పలికెడిది భాగవత మఁట!
పలికించెడివాఁడు రామభద్రుం డఁట! నేఁ
బలికిన భవహరమగునఁట!
పలికెద వేఱొండుగాథ బలుకఁగనేలా?

అంతట పోతన గృహమునకువచ్చి, శ్రీరామచంద్రుని యాజ్ఞ ననుసరించి, భాగవత రచనను సాగించినటుల నెలియు చున్నది.

శీ॥ శ్రీకైవల్య పథంబు జేరుటకునై
చింతించెదన్ లోకర
క్షాకారంభకు భక్తపాలన కళా
సంరంభకున్ దానవో

క్రేక స్తంభకు గేళిలోల విలస
ద్దృగ్జాల సంభూత నా
నా కంజాత భవాండకుంభకు మహా
నందాంగనా డింభకున్!

తన కవితా శక్తిచే మోక్షద్వారమును జేరుటకు మాత్రమే పోతనా మాత్యుడు భాగవతాంధ్రీకరణమునకు బూనుకొనెనని చెప్పవచ్చును.

పోతన్న శైవసాంప్రదాయుడు. శివభక్తుడు. అయినను వైష్ణవ సాంప్రదాయమును నిరసించువాడు కాదు! అద్వైతి. శివకేశవ భేదములేనివాడు. అంతేగాక శ్రీరామచంద్రు డాయనకు నిష్టదైవము. భగవంతు డొక్కడే యను తత్త్వచింత గలవాడు. అందులకు నిదర్శనము భాగవతాంధ్రీకరించుటను మహద్భాగ్యముగా భావించుకొనెను.

మ॥ ఒనరన్ నన్నయ దిక్కనాది కవు లీ
యుర్విన్ బురాణావళుల్
తెనుఁగుం జేయుచు మత్పురాకృత శుభా
ధిక్యంబు దా నెట్టిదో
తెనుఁగుం జేయరు మున్ను భాగవతమున్
దీనిం దెనింగించి నా
జననంబున్ సఫలంబుఁ జేసెద బున
ర్జన్మంబు లేకుండఁగన్.

భాగవతమును రచించుట వలన తన జన్మము సార్థకమగుననియు, దనకు బునర్జన్మము గలుగదనియు మనసార నమ్మి భాగవతాంధ్రీకరణకు బూనుకొనెను.

పోతనకు శివకేశవ భేదములేదని ఈ క్రింది పద్యము వలన బోధపడుచున్నది.

తే॥ చేతులారంగ శివుని బూజింపఁడేని
నోరు నొవ్వంగ హరి కీర్తి నుడువఁడేని!
దయయు, సత్యంబు లోనుఁగాఁ దలఁపడేని
గలుఁగనేఁటికిఁ దల్లుల కడుపుచేటు!

భాగవతము నందు బోతనకు భక్తి శ్రద్ధలు అనన్య సామాన్యము. క్రింది పద్యము గమనింపుడు.

ఆ॥ భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు
శూలికైనఁ దమ్మిచూలికైన!
విబుధ జనుల వలన విన్నంతఁ గన్నంతఁ
దెలియ వచ్చినంతఁ దేటపఱుతు!

వ్యాసభాగవతము నాంధ్రీకరించుటకు బూనకొని 'విబుధ జనుల వలన విన్నఁతఁ గన్నంత' యని యెందుల కనెనో గమనింపవలసియున్నది. ఆంధ్రీకరణమందు పోతనామాత్యుడేమైనా మార్పులు, కూర్పులు జేసెనేమోగమనింప వలసి యున్నది.

భారతాంధ్రీకరణ మందు కవిత్రయమున్న విషయ మును కుదించిరనియు, కొన్ని విషయములను నెత్తివేసిరనియు, నందురు. కాని పోతనామాత్యుడు భక్తి పారవశ్యమున ఉన్న విషయమును విస్తృత బఱచి స్వతంత్ర రచనగా రూపొందించెనని పండితుల యభిప్రాయము.

పోతనామాత్యుడు నిజముగా భక్తుడైన మహాకవి భక్తి కిచ్చినంత ప్రాధాన్యము పాండిత్యమున కీయలేదని కొందఱి యభిజ్ఞుల యభిప్రాయము. ఒక మహాకార్యమును ప్రారంభించి పూర్తి చేయవలయునని భావించినవారికి కార్య నిర్వహణమునందు గొన్ని లోపములు కలుగకమానవు. పూర్ణిమ చంద్రుని యందుగల స్వల్పమైన కళంకమును లోకులు దోషముగా బరిగణింపరుగదా!

పోతన రచించిన భాగవతము భక్తిభావ ప్రాధాన్యమైనది. పోతన భాగవతమును మించిన భక్తి ప్రాధాన్యమైన గ్రంథము తెలుగున లేదేమో!

మ॥ లలిత స్కంధము కృష్ణమూలము శుకా
లాపాభి రామంబు మం
జులతా శోభితమున్ సువర్ణ సుమన
స్సుజ్ఞేయమున్ సుందరో
జ్జ్వల వృత్తంబు మహాఫలంబు విమల
వ్యాసాలవాలంబునై
వెలయున్ భాగవతాఖ్య కల్పతరు వు
ర్విన్ సద్ద్విజ శ్రేయమై !

ఇంతటి మహిమాన్వితమైన భాగవతమును తెలుగు వారి కందించిన పోతన్న ధన్యుడు! బమ్మెర పోతనామాత్యున కివే మల్లెమాలతీ కుసుమాంజలులు !



# పోతన్నగారి వ్యక్తిత్వము - కవిత్వము

ఆంధ్రకవులలో పోతన్నగారి వ్యక్తిత్వ మాదర్శవంత మైనదిమాత్రమే గాదు; బూజనీయమైనది. ఒక మహాగ్రంథ మును రచించియు మడిమాన్యము లాసింపక, దారిద్ర్యమును స్వీకరించి, కర్షకుడై హాలమును జేపట్టి, గోమాతను, భూమా తను నమ్మి జీవించిన మహావ్యక్తి.

పోతన్నను గుఱించి యెన్నియో గాథలు తెలుగు దేశమున వ్యాప్తములై యున్నవి. అవి యన్నియు నిజమో అతిశయోక్తులోగాని నిజమని నమ్మునట్లు మన హృదయ మును ఒక భావము శాసించుచున్నది. పోతనామాత్యుని పేరు వినగనే మనకు శ్రీరామ చంద్రుడు, ఆలమందలో మురళిని మ్రోయించు గోపాలకృష్ణుడు, గోపకాంతలు మనకు ప్రత్యక్ష మగుదురు. భక్తి పురస్సరముగా నా మహాకవికి నమ్రశిరస్కుల మగుదుము. పోతన వ్యక్తిత్వమును స్ఫురింప జేయు కొన్ని సంఘటనలను స్మరింతము.

ఒకప్పుడు శ్రీనాథ మహాకవి పోతన్నగారి నపహా స్యము జేయుచు 'హాలికులకు కుశలమా ?' యని ప్రశ్నించె నట ! అంతట పోతన్న యీ క్రింది పద్యమును జెప్పి నాడట !

ఉ॥ బాలరసాలసాల నవ
పల్లవ కోమల కావ్య కన్యకన్
గూళల కిచ్చి యప్పడుపు,
గూడు భుజించుటకంటె సత్కవుల్

హాలికులైననేమి ? గహ
నాంతర సీమలఁ గందమూల కౌ
ద్దాలికులైన నేమి ? నిజ
దార సుతోదర పోషణార్థమై !

ఈ పద్యము వలన పోతన్నగారి శీల మెంతటి పవిత్రమైనదో, వ్యక్తిగత భావము లెంతటి స్థిరమైనవో తెలియుచున్నది.

ఒకప్పుడు శ్రీనాథుడే పోతనతో నీ విధముగా బలికెనట !

క॥ కమ్మని గ్రంథం బొక్కటి
యిమ్మగ నే నృపతికైనఁ గృతి యిచ్చినచో
గొమ్మని యియ్యరె వెయ్యా
ర్లిమ్మాహి దున్నంగ నేల యిట్టి మహాత్మల్ ?

అని వలుకగా పోతన్నగారు క్షణము దీర్ఘాలోచనాపరుడై యున్నపుడు సరస్వతీదేవి ప్రత్యక్షమై కన్నీరు పెట్టినదట ! పోతన్న సరస్వతీదేవి నిట్లోదార్చినాడట !

ఉ॥ కాటుక కంటి నీరు చను
కట్టు పయింబడ నేల యేడ్చెదో
కైటభ దైత్య మర్దనుని
గాదిలి కోడల ! యో మదంబ ! యో
హాటక గర్భురాణి ! నిను
నాకటికిం గొనిపోయి యల్ల క
ర్ణాట కిరాత కీచకుల
కమ్మ త్రిశుద్ధిగ నమ్మ భారతీ

రాజాశ్రయ మెంతటి హీనమైనదిగా బోతన భావించెనో దెలియుచున్నది. పోతనకాలమునా డట్టి కిరాట కీచకు లుండినారేమో ! అందులకే రాజాశ్రయము నంత తీవ్రముగా ఖండించెను.

ఇట్లే పోతన్నగారిని గురించి యనేకములైన కథలు గాథలు గలవు. పోతన వ్యక్తిత్వము పవిత్రము, పావనమునై యున్నది. ఆంధ్రమహాకవులలో నీ కవికున్న యాదర భావ మనన్య సామాన్యము.

చంద్రునియందు మచ్చవలె భోగినీదండకమును రచించెనని పోతనామాత్యునిపై యొక యపవాదము గలదు. కల్మషుడైన యొక కవి దానిని వ్రాసి పోతన్నగారి కంట గట్టెనని మనము భావింపవలసి యున్నది.

ఏమైనను బమ్మెర పోతరాజును దెనుగు వారందఱును బూజింతురు. గౌరవింతురు. భాగవతమును జిరకాలము పఠింతురు. భాగవతమును బఠించునప్పుడు పోతనను గూడ స్మరింతురు. పోతన జనన మొందుటచే తెలుగుదేశము ధన్యమైనది. తెలుగుబాస పునీతమైనది. కృష్ణభక్తి తెలుగుదేశమున వ్యాప్తిచెందినది.

## పోతన్నగారి శైలీసంపద

బమ్మెర పోతన్నగారి శైలి విలక్షణమైనది. భక్తిభావ సమ్మిళితమైనది. పోతన్నగారి గొంతుతో భగవంతుడు కంఠమును గలిపెనా యన్నట్లుండును. ఆబాల గోపాలమున

కందుబాటులో నుండునది. నేర్పరియైన ధనుర్ధారి శస్త్రాస్త్రములను ప్రయోగించినటుల నాతన తెలుగునను, సంస్కృతమునను రచనా సామగ్రిని సమకూర్పగలడు! సమకూర్చుట కాదు; ఆతని ఘంటమునుండి యప్రయత్నముగా వెలువడు చుండును.

క॥ కొందఱకుఁ దెనుఁగు గుణ మగుఁ;
గొందఱకును సంస్కృతంబు గుణ మగు; రెండుం
గొందఱకు గుణము లగు; నే
నందఱ మెప్పింతుఁ గృతుల నయ్యై యెడలన్ !

ఈ పద్యము నిజముగా పోతన్న కవితా రీతిని వ్యక్తీకరించుచున్నది. కొన్ని పద్యములు సంస్కృత పద భూయిష్ఠములై యుండును.

ఉ॥ శారద నీరదేందు ఘన
సార పటీర మరాళ మల్లికా
హార తుషార ఫేన రజ
తాచల కాశ ఫణీశ కుంద మం
దార సుధాపయోధి సిత
తామర సామర వాహినీ శుభా
కారత నొప్పు నిన్ను మదిఁ
గానఁగ నెన్నఁడు గల్గు భారతీ !

అట్లే కొన్ని పద్యములు తేటతెనుఁగున గుదిగ్రుచ్చ బడినవి. ఈ క్రింది పద్యము గమనింపుడు.

ఉ॥ అమ్మల గన్నయమ్మ! ముగు
రమ్మల మూలపుటమ్మ! చాలఁ బె

ద్దమ్మ! సురారులమ్మ! కడు
పాఱడి పుచ్చిన యమ్మ! దన్ను లో
నమ్మిన వేల్పు టమ్మల మ
నమ్ముల నుండెడి యమ్మ! దుర్గ! మా
యమ్మ! కృపాబ్ధి యిచ్చుత! మ
హత్త్వ కవిత్వ పటుత్వ సంపదల్!

తే॥ చేతులారంగ శివునిఁ బూజింపఁడేని!
నోరు నొవ్వంగ హరికీర్తి నుడువఁడేని!
దయము సత్యంబు లోనుఁగాఁ దలపఁడేని!
గలుగనేటికి దల్లుల కడుపు చేటు?

పోతన శైలీసంపద యెంత సుందరమో, భావము లంత మృదుమధురములు. శబ్దాలంకారము లడుగడుగున మృదంగ ధ్వనులవలె వినిపించుచుండును. సీసపద్యములు వీణానాదము వలె, తల్లిపాడు జోలపాటలవలె నుండును. భావములు హృదయమునజేరి యూయలనూపును. ఆనంద తరంగముల నోలాడించును.

తిక్కన సోమయాజివలె చిన్న చిన్న మాటలలో అనంతార్థమును స్ఫురింపజేయుచుండును. ఈ పద్యమును జూడుడు.

కం॥ ఇందు గలఁ డందు లేఁడని
సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన
నందందే కలఁడు! దానవాగ్రణి వింటే!

ఈశ్వరుడు సర్వవ్యాపకుడని చిన్న కంద పద్యములో ఉపనిషత్తుల సారమంతయు స్ఫురింప జేసినాడు.

గీ॥ ఇనుమయస్కాంత సన్నిధి నెట్లు భ్రాంత
మగు హృషీకేశు సన్నిధి నా విధమునఁ
గరగు చున్నది దైవయోగమునఁ జేసి
బ్రాహ్మణోత్తమ! చిత్తంబు భ్రాంత మగుచు!

పోతన శైలీసంపద మనల నయస్కాంతమువలె నాకర్షించును. శ్రీ నారాయణ పాదపద్మ యుగళీ చింతామృతాస్వాద సంధానులను జేయును. మందార మకరంద మాధుర్యములలో దేలించును. నిర్మల మందాకినీ వీచికలలో దూగించును. లలిత రసాల పల్లవఖాదియై చొక్కు కోయిలలచేత కుహూ కుహూ రవములను వినిపింపజేయును. పూర్ణేంద్రు చంద్రికలలో విహరింపజేయును. హరిభక్తి పరవశులనుజేసి యానంద లోకముల విహరింపజేయును.

కొందఱు పండితులు పోతన కవిత్వమునందు వ్యాకరణ దోషములనెంతురు. దోషములేని వస్తువు ప్రపంచము నందేదియును లేదుగదా!

పోతన్న పూనుకొనినది ఒక మహాకార్యము, అది భాగవతాంధ్రీకరణము, ద్వాదశస్కంధములతో నొప్పునది. తాను దరించి లోకమును దరింపజేయుట కీ కార్యమును దలపెట్టినాడు. తిక్కన సోమయాజి పదునేను పర్వముల భారతమును బూర్తిజేసినట్లు తానును భాగవతమును బూర్తిజేయ నిశ్చయించినాడు. అట్టి మహాకార్యములకు బూనుకొని నప్పుడు కొన్ని వ్యాకరణ దోషములు దొరలియుండ

వచ్చును. అంతమాత్రము చేత నా మహాకవిని తప్పుబట్ట నవ సరము లేదు.

భాష యనునది ప్రవాహము వంటిది. దారిలోనది యెన్నియో యవాంతరము లెదుర్కొనవలసి వచ్చు చుండును. ప్రవహించుచు నొకచోటనాగి సుడులు తిరుగవలసి వచ్చుచుండును.

అందును బోతన సహజ పాండిత్యుడు. ఆతని కవిత భగవత్ప్రసాదితము. సకల లోకేశ్వరి మూలశక్తియైన బ్రహ్మీదేవి వరప్రసాదము. అట్టి కవితా శక్తిని దోషము లెంచుటకంటె దోసములను సరిజేసికొని పోతన్నగారి వాగమృతములో కవితా ధారలో, భక్తిరస ప్రవాహములో నోలాడుట మనకు ముక్తిదాయకము! శ్రేయోదాయకము.



## ఆంధ్ర భాగవతమంతయును పోతనయే రచించెనా?

ఆంధ్ర మహాభాగవతమని పేరు చెప్పగనే బమ్మెర పోతనామాత్యుడు మనకు సాక్షాత్కరించును. మఱి పోతనామాత్యుడు భాగవత మంతయును తానే రచించెనా? లేక కొన్ని స్కంథములు మాత్రమే రచించెనా? విచారింపవలసి యున్నది.

కొన్ని భాగములు పోతన శిష్యుడు వెలిగందల నారయయును, కొంత భాగము నేర్పూరి సింగనయు, మఱి కొంత

భాగము గంగరాజును రచించినట్లు స్కంధాంతము లందుగల గద్యలవలన తెలియుచున్నది.

పోతన భాగవతమునంతను నాంధ్రీకరించి తన యవసానకాలమునందు కుమారుడు మల్లన కిచ్చెననియు, నాతని యశ్రద్ధ కారణమున యా తాటియాకుల గ్రంథమునకు జెదలువట్టి కొన్ని కొన్ని భాగములు శిథిలము లైననియు, నా శిథిలములైన భాగములను పోతన శిష్యుడు వెలిగందల నారయమును, నేర్పూరి సింగన, గంగరాజులు బూరించి రనియు గొందఱు జెప్పుదురు.

మఱియొక యుదంత మేమనగా సర్వజ్ఞసింగ భూపాలుడు భాగవతము తన కంకితమీయ లేదను నక్కసుతో భూస్థాపితము జేసినట్లును, కొన్నినాళ్ళకు నా తాటి యాకుల గ్రంథమును బైకితీయగా కొన్ని భాగములు శిథిలములైన వనియు నా శిథిలములయిన భాగములను బై మువ్వురుసు మఱల నాంధ్రీకరించి నట్లును జెప్పికొందురు.

మఱికొంద అట్లుగాక భాస్కర రామాయణము నుదాహరింతురు. భాస్కరుడు రామాయణము నంతను దా నొక్కడే రచింప సాధ్యము గాదని దలంచి, కుమారునకు శిష్యులకు కొంత పంచి యిచ్చి, తాను కొంత భాగమును రచించి, రామాయణమును బూర్తిజేసెనట! అట్లే పోతనయు భాగవతము లోని రసవత్తర ఘట్టములను తాను స్వీకరించి, శిష్యుడు వెలిగందల నారయకు, తన సహచరులైన నేర్పూరి సింగన, గంగరాజులకు బంచియిచ్చి, వారలు రచించిన భాగ

ములను సరిజూచి, తాను రచించిన భాగములకు సన్నిహిత బఱచి భాగవతమును బూర్తి చేసినటుల జెప్పుదురు.

లేదా రసవత్తర భాగములను పోతన రచించి యస్తమింపగా మిగిలిన భాగములను పోతన శిష్యులును, సహచరులును బూరిజేసి యుండి యుండవచ్చును.

అందే యే భాగములు నితరులు రచించిరో దేల్చుట కష్టమయిన విషయము. నిజమునకు పోతనామాత్యుడే భాగవతము నంతను రచించుటకు బూనుకొనెనని భావించుట కీ క్రింది పద్యము నాధారముగా దీసికొనవచ్చును.

మ. ఒనరన్ నన్నయ దిక్కనాది కవు లీ
యుర్విన్ బురాణావళుల్
దెనుగుం జేయుచు మత్పురాకృత శుభా
ధిక్యంబుఁ దా నెట్టిదో
తెనుగుం జేయరు మున్ను భాగవతమున్
దీనిం దెనింగించి నా
జననంబున్ సఫలంబు జేసెదఁ బున
ర్జన్మంబు లేకుండగన్!

పై పద్యము వలన భాగవతము నంతయు పోతనామాత్యుడాంధ్రీకరించుటకు బూనుకొనెనని తెలియుచున్నది.

ఆ॥ భాగవతముఁ దెలిసి పలుకుట చిత్రంబు
శూలికైన దమ్మిచూలికైన!

సంస్కృత భాగవతము ద్వాదశ స్కంధములలోనున్న మహాగ్రంథము. దానినంతను భావించుటకు, తెలుగున బలుకుట యెంతో కష్టమయిన కార్యముగా బోతన భావించెను.

రామాయణమును బూర్తిచేయుటయందు భాస్కరుడు తన కుమారుని యొక్కయు, సహచరుల యొక్కయు సహాయము ను స్వీకరించినటుల పోతనయు తన భాగవతాంధ్రీకరణ మందు శిష్యుడయిన వెలిగందల నారయ యొక్కయు, సహచరులయిన సింగన, గంగరాజుల యొక్క సహాయమును స్వీకరించినట్లు భావింపవచ్చును.

పై మువ్వుర సహాయమును స్వీకరించి, భాగవతమును బూర్తి చేసినపోతనామాత్యుడు తన పేరు పెట్టుకొనక. యాశ్వాసాంత గద్యాలలో వారల నామముల నేల నుటంకింపజేసెనని ప్రశ్నింపవచ్చును.

పోతనామాత్యుని విశాలహృదయము మనకు సువ్యక్తమగును. వారలు రచించిన భాగములు తాను సరిజూచి, జత గూర్చినప్పటికిని వారల నామము లుండుటయే యుక్తమని భావించి యుండును.

పోతనకు కావలసినది కీర్తి కాంక్షకాదు గదా! విష్ణుకథాప్రశస్తమైన భాగవతమును దెనుగునబూరించి శ్రీరామచంద్రున కంకితమిచ్చుట - యిదీ పోతనగారి లక్ష్యము! ఇదీ పోతన్న గారి ధ్యేయము!

ఆ కార్యము తీరిపోయినది. మధ్యలో నాగిపోలేదు. రసవత్తరములయిన భాగములను దాను బూర్తి చేసెను. ప్రహ్లాద చరిత్రము, గజేంద్రమోక్షము, వామన చరిత్రము, మున్నగు ఆంధ్ర భాగవతమునందలికథాసుందరములందు పోతనమూర్తి మనకు ప్రత్యక్షమగును. ఇతరులు పూరించిన తదితరభాగములందును పోతన్నగారి కూర్పునైపుణ్యము ద్యోతకమగును.

# పోతన్నగారి భక్తి భావము

పోతనామాత్యుడు కేవలము కవిమాత్రుడే కాదు. మహాభక్తుడు. శ్రీ సీతారాములను గన్నులార గాంచి తరించిన మహానుభావుడు. భాగవతమును తెలుగువారి కందింప బుట్టినకారణజన్ముడు! భారతీయసంస్కృతిని, వేదాంతమును, జీవన విధానమును తెలుగుప్రజల కందించిన దివ్యపురుషుడు. పోతన శివకేశవ భేదముల సంకుచిత మనస్తత్వము గలవాడు కాదు! అద్వైతి. మోక్షద్వారమదిగోయని చూపించినవాడు. భగవద్రూపమును, మహనీయ లీలలను అక్షర రూపమున మన కందించిన మహానుభావుడు!

పోతన భాగవతమున మనకు జూపిన భగవంతుడు సగుణుడు. నిర్గుణుడు. సర్వవ్యాపి! సృష్టి స్థితి లయములకు కారకుడు! పోతన భగవంతు డెట్టివాడో దర్శింపుడు!

కం॥ ఇందుఁ గలఁ డందు లేఁ డని
సందేహము వలదు, చక్రి సర్వోపగతుం
డెం దెందు వెదకి చూచిన
నందందే గలడు దానవాగ్రణి! వింటే !

పోతన్నగారి భగవంతుడు సర్వోపగతుడు! ఎందు జూచిన నందే కనబడును. మఱియొక పద్యమును గమనింపుడు.

మ. కలఁ డంబోధిఁ, గలండు గాలిఁ,
గలఁ డాకాశంబునం, గుంభినిం
గలఁ, డగ్నిన్ దిశలం బగళ్ళ నిశలన్
ఖద్యోత చంద్రాత్మలం

గలఁ, డోంకారమునం ద్రిమూర్తులఁ ద్రిలిం
గ వ్యక్తులం దంతటం
గలఁ, డీశుండు గలండు తండ్రి! వెదకం
గా నేల యీ యా యెడన్!

భగవంతుడెల్ల వస్తువుల నిండియుండునని పోతన్నగారి విశ్వాసము. క్రింది పద్యము గమనింపుడు.

కం॥ లోకంబులు లోకేశులు
లోకస్థులు దెగినఁ దుది నలోకంబగు పెం
జీఁకటి కవ్వల నెవ్వం
డేకాకృతి వెలుఁగు నతని నే సేవింతున్!

భగవంతుని శాశ్వతునిగా భావించుచు జ్యోతిస్వరూపునిగా పెంజీకటి కవ్వల వెలుగు చుండునని పలికెను. జ్యోతి స్వరూపుని జేరుటకు జీవుడు పెంజీకటిని దాటవలెను. అనగా మాయను దెలిసికొనవలెనని భావము. మానవుడు జ్యోతి స్వరూపుని జేరుటకు గల భక్తి మార్గములను పోతన యెంత చక్కగా విశదపఱచెనో గమనింపుడు.

మ॥ తను హృద్భాషల సఖ్యమున్, శ్రవణమున్, దాసత్వమున్, వందనా
ర్చనముల్, సేవయు, నాత్మలో నెఱుకయున్, సంకీర్తనల్, చింతనం
బను నీ తొమ్మిది భక్తిమార్గముల స ర్వాత్మున్ హరిన్ నమ్మి స
జ్జనుడై యుండుట భద్రమంచుఁ దలఁతున్ సత్యంబు దైత్యోత్తమా!

కేవలము భక్తిమార్గమున భగవంతుని నమ్ముట చాలదట! సజ్జనుడై యుండవలెనట! భగవద్భక్తి, సజ్జనత యీ రెండును విడదీయరానివని పోతన్నగారు ప్రహ్లాదునిచే బలికించెను.

భగవంతుని గూర్చియు, భగవద్భక్తిని గూర్చియు నింత స్పష్టముగా అల్పాక్షరములతో అనంతమైన వేదాంతార్థములను జెప్పినవారు లేరు! పోతన రచనా శిల్పముల గుఱించియు, భక్తిని గుఱించియు మఱియొకచోట బరిశీలింతము.

## పోతన్నగారి ప్రహ్లాదుడు

సీ॥ తనయందు నఖిల భూతములందు నొకభంగి
సమహిత త్వంబున జరగువాఁడు
పెద్దలఁ బొడగన్న భృత్యుని కైవడి
జేరి నమస్కృతుల్ సేయువాఁడు
కన్నుదోయికి నన్య కాంత లడ్డంబయిన
మాతృభావము సేసి మఱలువాఁడు
తల్లి దండ్రుల భంగి ధర్మవత్సలతను
దీనుల గావఁ జింతించువాఁడు!

గీ॥ సఖుల యెడ సోదరస్థితి జరపువాఁడు!
దైవతలములంచు గురువుల దలఁచువాఁడు!
లీలలందును బొంకులు లేనివాఁడు!
లలిత మర్యాదుడైన ప్రహ్లాదు డధిప!

ప్రహ్లాదుని పరిచయము చేయుచు పోతన్నగారు చెప్పిన పద్యము. కేవలము ప్రహ్లాదుని గుఱించి చెప్పిన పద్యము కాదు, లోకములోని మానవులందఱు యిట్టి నడవడిని గలిగియుండవలెననియు, ఇట్టి సంస్కృతిని యలవఱచుకొన వలసినదనీ పోతన్నగారు లోకమునకు చెప్పినది.

సకల వేదాంతసారమును, మునిమతమును, మోక్ష విద్యను ప్రహ్లాదుని నోట పోతన పలికించును. నీవు నేనను భేదభావము వలదనియు, హరి సర్వాంతర్యామి యైనట్లు ఆత్మ గూడ నట్లే యని పలికించును. మునిమతమును నసుర బాలకులకు ప్రహ్లాదుని నోట బలికించును. భక్తుల యాపదలను భగవంతు డెట్లు పరిహరించునో ప్రహ్లాద చరిత్రము వలన పోతన మనకు దర్శింపజేయును. భక్తుల యాపదలు మాపుటకు భగవంతుడెట్టి రూపము దాల్చుటకైనను సిద్ధ పడునని విశదబఱచును.

ప్రహ్లాదుని గొప్ప అహింసావాదిగా పోతన్నగారు చరిత్ర చిత్రణము గావించిరి. తండ్రి ప్రహ్లాదుని యెన్ని బాధలు పెట్టినను సహించునుగాని పల్లెత్తు బాధ వ్యక్తము జేయడు. భారతజాతిపిత గాంధీజీ అహింసా తత్త్వమును ప్రహ్లాదుని నుండి నేర్చుకొనినాడేమో యని ప్రియనిపించును.

ఉ॥ శూలములన్ నిశాచరులు
 స్రుక్కక దేహము విగ్రహింపఁగా
బాలుఁడు నేలపైఁ బడడు
 పాఱఁడు చావఁడు తండ్రినైన నా

పాలికి వచ్చి చక్రధరు
పక్షము మానితి నంచుఁ బాదముల్
ఫాలము సోఁక మ్రొక్కెఁ దనపాయత
నొందుట కేమి హేతువో!

ఈపద్యమువలన ప్రహ్లాదునిమూర్తీభవించినయహింసావాదిగా, మానవతా వాదిగా మనము భావింకవచ్చును. అంతేగాక ధీరపురుషునిగా, స్థితప్రజ్ఞునిగా పోతన్నగారు ప్రహ్లాదుని దర్శింపజేయును.

పోతన్నగారి వలన ప్రహ్లాదుడు ఆంధ్ర ప్రజల కాత్మీయుడేకాదు, ఆదర్శ పురుషుడయినాడు. అట్టి భాగవతప్రహ్లాదుని, బమ్మెర పోతనామాత్యుని తెలుగు ప్రజలేనాటికి విస్మరింపరు.

## ఎఱ్ఱన ప్రభావము

పోతనకంటె ఎఱ్ఱన యించుమించు ఒక శతాబ్దము పూర్వుడని చెప్పవచ్చును. కొందఱు ఎఱ్ఱన ప్రభావము పోతనపై ప్రహ్లాద రచనమునందు బడియుండవచ్చునని యందురు. పరిశీలింతము.

ఈ విషయము వివాదగ్రస్తమయినదని భావింపవచ్చును. నిజమునకు ఎఱ్ఱన వంద సంవత్సరముల పూర్వుడగుటవలన పోతన యెఱ్ఱన రచించిన గ్రంథములను చదివి యుండవచ్చును అందు-ముఖ్యముగా నృసింహపురాణము

నందలి వర్ణనాత్మకమయిన కవితారీతిని జూచి ప్రభావితు డగుటలో నాశ్చర్యము లేదు.

అయితే - పోతన లక్ష్యములో, ధ్యేయములో నా ప్రభావమంత మార్పును దేలేదని భావింపవలయును. ఆయన ధ్యేయమొక్కటే యొక్కటి! వ్యాసభాగవతమును దెనుగున నాంధ్రీకరించుట. వర్ణనాత్మకములయిన కథాంశములందు ప్రవేశబెట్టుట యనగా మూలకారుని కృతిని వికృతిని గలిగించుటయే యగును. అది అతుకుల బొంత యగును.

అందువలననే పోతన్నగారు సంస్కృత భాగవతము లోని కథాంశములను విస్తరించి భక్తి పారవశ్యముతో రచించెనేగాని మూలకారుని కృతికి స్వతంత్ర కల్పవలను జేర్ప లేదు.

ఎఱ్ఱన కవితాశిల్పము పోతన కవితా శిల్పము కంటె నున్నతమైనది కావచ్చును. ఎఱ్ఱన కవితలో గానవచ్చు భావుకత, శబ్ద గాంభీర్యము, అలంకారిక శైలి, పండారిస వర్ణనా నైపుణ్యము, పోతన కవితలో కొంత గానరాక పోవచ్చును. అంతమాత్రమున పోతన కవితా సంపద తక్కువ యని భావింపరాదు.

ఇరువురును మహాకవులు! పరమేశ్వర ప్రసాదితమైన కవితాశక్తిని గలిగినవారు. ఒక్కొక మహా కార్యమును సాధించుటకు జనన మొందినవారు! వారి యాశయములు, లక్ష్యములు, ధ్యేయములు వేఱు వేఱు!

పోతనగారి లక్ష్యము నన్నయ తిక్కనాది కవు లనేక ములయిన పురాణావళులను తెలుగు సేయుచు తనకై వదిలిన భాగవతమునాంధ్రీకరించి శ్రీరామచంద్రున కంకితమిచ్చుట.

ఎఱ్ఱన లక్ష్యము నన్నయ తిక్కనాదికవులు తనకై వదిలిన భారతారణ్య పర్వశేషమును బూర్తిసేయుట. నవ్య కవితారీతిని ఒక మహద్గ్రంథమును సృజించి, భావి కవులకు మార్గమును జూపుట.

ఇరువురి యాశయములు మహత్తరములైనవి. వానిని ఒకవిధముగా వారు సాధించిరని చెప్పవచ్చును.

ఎఱ్ఱన మహాశిల్పి! చిత్రకారుడు! స్వీయ ప్రతిభతో కావ్య నిర్మాణము చేయగల ప్రజ్ఞాశాలి! తన హృదయము నందు విశ్వ రహస్యములన్నియు గాంచు శక్తిశాలి! నూత్న వినూత్న మార్గములను తెనుగున దారిజూపినవాడు! సరి క్రొత్త కాంతికిరణములను, లోకోత్తర దృశ్యముల నంతర్గతమున భావింపగలవాడు. అట్టిశిల్పకారుని మహనీయ తత్వము నెవ్వరైన మెచ్చుకొనకుండ నుండగలరా? బాలభానుని బంగారు కాంతులను, చంద్రోదయ జ్యోత్స్నా సుందరముల నెవరు చూడకుండ నుండగలరు?

పోతన్నపై ఎఱ్ఱన్న ప్రభావము పడినను పోతన్న చలింపలేదు. రచనా ధ్యేయమును విడువక పయనించినాడు. పోతన్నగారు ఎఱ్ఱన్నను పీఠికలో ప్రత్యేకముగా స్మరింపలేదు.

పిండితార్థ మేమనగా ఎఱ్ఱయగారి ప్రభావము, పోతన్నగారిపై పడియుండవచ్చును. అంతేగాని ఎఱ్ఱయగారిని

పోతన్నగా రనుకరింప యత్నింపలేదని భావింప వలసి యున్నది.

పోతన్నగారి కొక ప్రత్యేకమైన కవితాశయ్యగలదు. అది పరమేశ్వర భక్తి! మధుర భక్తి! కృష్ణభక్తి! ఆ నావచే నతడెన్ని ప్రవాహములనైన దాటి పోగలడు! అతని కవితా మార్గము భాగవతమున ప్రతిఘట్టమున దర్శనమిచ్చు చున్నది.



భక్త ప్రహ్లాదుని దివ్య చరిత్రము

## ఎఱ్ఱన - పోతనలు రచించిన కథావృత్తాంతములు

ఇంత వఱకు మన ఎఱ్ఱన - పోతనల జీవిత కాలాదులను, వారల రచనా విధానముల గుఱించి కొంత బరిశీలించితిమి. ఇంక వారిరువురు వ్రాసిన ప్రహ్లాద చరిత్రములందుగల కథావృత్తాంత విశేషములను బరిశీలించుదము.

ఎఱ్ఱయ వ్రాసిన ప్రహ్లాద చరిత్రము నృసింహ పురాణమను గ్రంథములో గలదు పోతన్న వ్రాసిన ప్రహ్లాద చరిత్రము శ్రీ మదాంధ్ర మహాభాగవతములో సప్తమ స్కంథములో గలదు. ఇరువురును మహాకవులు! భక్తి భావకులు! పరమ భక్తుడైన ప్రహ్లాద చరిత్ర కథా రచనయందు వారు కనబఱచిన కమనీయ కవితా మాధుర్యములను బరిశీలింతము. ముందుగా ప్రహ్లాదుని కథా వృత్తాంతమును దెలిసి కొందము.

## ప్రహ్లాదుని చరిత్రము — కథా వృత్తాంతము

హరిద్వార రక్షకులైన జయవిజయులు సనకసనందనాదుల వలన శపింపబడి, రాక్షసులుగా దితిగర్భమున జన్మింతురు. వారు లోకకంటకులుగా వ్యవహరించుట వలన విష్ణువు వరాహావతారమున హిరణ్యాక్షుని వధించును. హిరణ్యకశ్యపుడు తపసుచే నజుని మెప్పించి, దుర్లభములైన వరములను బొంది, దేవతలను, మునులను బాధించుచుండును.

దైత్యునికి విష్ణుభక్తుడైన కుమారుడు జన్మించును. అతడే ప్రహ్లాదుడు. హరిభక్తి మానుమని తండ్రి ప్రహ్లాదుని యనేక విధముల హింసించును. హరిమాయ వలన ప్రహ్లాదుడు తండ్రి పెట్టిన హింసలనుండి రక్షితుడగు చుండును. తుదకు శ్రీమన్నారాయణుడు నరసింహావతార రూపమున స్తంభోద్భవమంది రక్కసుని బరిమార్చును. ప్రహ్లాదుని మునులను, దేవతలను కాపాడును. ఇదీ సూక్ష్మముగా ప్రహ్లాదుని వృత్తాంతము.

## ప్రహ్లాద చరిత్ర రచనము — ఎఱ్ఱన

కవిత్రయములో నొకరైన యెఱ్ఱాప్రెగడ లక్ష్మీనరసింహావతారమును పురాణకథ అనుపేర ప్రహ్లాద చరిత్రమును ప్రబంధరీతిని పదునాల్గవ శతాబ్దియందు రచించియుండెను. యెఱ్ఱయ ఈ కథా వృత్తాంతమును బ్రహ్మాండాది పురాణములనుండి స్వల్పాల్ప కథాంశమును గైకొని, విస్తరణమును గావించి, వర్ణనాత్మకముగా ప్రబంధరీతిని రచించెను. పంచమాశ్వాసములుగా తీర్చిదిద్దిన యీ గ్రంథము

ఎఱ్ఱయగారి ప్రతిభా వైదగ్ధ్యమును, భావనాశక్తిని చాటుచున్నది.

ప్రథమ ద్వితీయ తృతీయాశ్వాసములు బ్రహ్మాండాది పురాణములనుండి స్వల్పాల్ప కథాభాగమును విస్తృతపఱచి, కొన్ని స్వతంత్ర కల్పనలను గావించి కథయందు ప్రవేశపెట్టెను. ఎఱ్ఱయధీశక్తికివి నిదర్శనములు. చతుర్థపంచమాశ్వాసములు భాగవతమునకు మూలమైన విష్ణుపురాణమునుండి గ్రహించి, తన ప్రబంధ కవితా రీతిలో తీర్చిదిద్దెను. గ్రంథాంతమున యహోబలతీర్థ మహాత్మ్యమును నభివర్ణించెను.

## ప్రహ్లాద చరిత్ర రచనము -- పోతన

సంస్కృతములోనున్న వ్యాసభాగవతము ద్వాదశస్కంధములుగల మహాగ్రంథము. దీనిని 15వ శతాబ్దియందు పోతనగారు ఆంధ్రీకరించుట సర్వాంధ్ర జనులకు విదితమే! పోతనగారిని గుఱించి తెలియనివారుగాని పోతన రచించిన భాగవతములోని పద్యములు రానివారుగాని తెలుగు దేశమున నుండరు.

ఈ భాగవతమునందు సప్తమ స్కంధములో ప్రహ్లాదుని దివ్యచరిత్ర గలదు. భక్తిరస ప్రధానమైన పోతన్నగారి రచనా విధాన మనితర సాధ్యమైనది. పోతన్న రచించిన ప్రహ్లాద చరిత్రము భాగవతమున కనుకరణమైనను స్వతంత్ర రచనగా, భక్తిరస పూరితమైన స్రవంతిగా నొప్పుచున్నది.

## తులనాత్మక పరిశీలనము

ఇరువురు వ్రాసిన ప్రహ్లాద చరిత్రములు పురాణభాగవత గ్రంథాంతర్భాగములైనను స్వతంత్ర రచనలవలె నొప్పారుచున్నవి. దేనికది ప్రత్యేకమైన శైలీ రీతులలో ప్రకాశించుచు పాఠకుల మనస్సులను శ్రీహరి పాదాంకితములుగా జేయుచున్నవి. ఆనంద లోకముల విహరింప జేయుచున్నవి.

ఈ రెండింటిని సాహిత్య దృష్టితో దులనాత్మకముగా బరిశీలనము గావింతము. రెండింటి యందుగల వినూత్న కల్పనా సుందరములను, భక్తిరస మాధుర్యములను గ్రోలి యానంద సరిత్తరంగముల నోలాడుదము.

# నృసింహ పురాణము - కథా విషయములు

ప్రబంధ పరమేశ్వరుడు, శంభుదాసుడునైన ఎఱ్ఱాప్రెగడ వ్రాసిన నృసింహ పురాణమునందు బ్రతియాశ్వాసమునందుగల కథా వైచిత్ర్యమును బరిశీలింతము.

ప్రథమాశ్వాసమునందుగల పీఠిక మధుర మంజుల పదములతో, శ్రీమన్నారాయణుని స్తుతిగీతములతో బ్రారంభింప బడినది. ఇష్టదేవతాస్తుత్యనంతరము నన్నయ తిక్కనాదులను కవి సంస్మరించెను. తరువాత తన గురువైన శ్రీ శంకర స్వామిని, తండ్రిని, పితామహుడైన ఎఱ్ఱపోతనను స్మరించి, గ్రంథరచనకు గలిగిన కారణములను వివరించుచు

కృతిపతియైన శ్రీమదహోబలుని స్తుతించుచు పదునొకండు పద్యములను జెప్పెను. ఇది షష్ఠ్యంతములు!

ప్రథమాశ్వాసము — కథావృత్తాంతము

నైమిశారణ్యమున మునులు బ్రహ్మాండ పురాణమున గల తీర్థభాగ మహాత్మ్యమును రోమహర్షణుని వలన వినుచునే పుణ్యతీర్థము బహుపుణ్యదాయకమని ప్రశ్నింతురు. వారికి ప్రత్యుత్తరముగా రోమహర్షణుడు పూర్వము దేవశ్రవుడు గాలవునకు అహోబల తీర్థము బహుపుణ్యదాయకమని జెప్పిననియు, దానిని వినిపింతునని జెప్పి రోమహర్షణుడు మునులకు, అహోబలతీర్థ మహాత్మ్యమును నభివర్ణించును. దానినే కథావృత్తాంతముగా గైకొని నృసింహ పురాణమును ఎఱ్ఱాప్రెగడ కృతిగా నిర్మించెను.

ఈ ప్రథమాశ్వాసమునందు ప్రథమమున దుగ్ధపారావారమును, అందుగల శ్వేతద్వీపమును వైకుంఠ నగరమున శ్వేత ద్వీపవాసులను, వర్ణించుట గలదు. వైకుంఠ పురమునకు ప్రభువైన శ్రీ మహావిష్ణువును, లక్ష్మీదేవిని వర్ణించుట గలదు. శరదాగమనము, శ్రీ మహావిష్ణువు మేల్కొనుట గలదు.

సనకసనందనాదులు స్వామిని దర్శించుటకు వచ్చుట హరిద్వార రక్షకులు జయవిజయులు వారి నడ్డగించుట, వారు కోపించి రాక్షసులుగా జన్మింపుడని శపించుట, స్వామికీ వార్త తెలిసి, యచ్చటికి వచ్చి మునుల ననునయించుట, జయవిజయుల నోదార్చుట గలదు. దితి గర్భమున జయవిజ

యులు హిరణ్యాక్ష హిరణ్యకశ్యపులుగా జన్మించుటతో ప్రథమాశ్వాసము సమాప్త మగుచున్నది.

ద్వితీయాశ్వాసము-కథావృత్తాంతము

నృసింహ పురాణము ద్వితీయాశ్వాసమునందు జయ విజయులు దితి గర్భమున హిరణ్య కశ్యప హిరణ్యాక్షు లుగా జనన మొందుట. హిరణ్యకశ్యపుడు లోకములన్నియు నేలవలెనను కాంక్షతో నజుని గుఱించి తపమాచరించుట గలదు. దైత్యుని తపమునకు భయమంది పురందరుడు దేవ గురు నాశ్రయించుట-దేవగురుడు ధైర్యవచనములు వలికి నారాయణ మంత్ర ముపదేశించుట గలదు.

పురందరుడు పురమునకు జని రంభాది యప్సరసలను దైత్యుని తపోభంగమును జేయుడని బంపుట-అప్సరస లియ్య కొని గంధమాదనమున బ్రవేశించుట ఆకస్మిక వసంతాగమ నము-అచ్చరల యాటపాటలు దైత్యునాకర్షింపలేక యచ్చ రలు సిగ్గువడుట గలదు. అజుడు దైత్యుని తపమునకుమెచ్చి దుర్లభములైన వరములిచ్చుట గలదు. హిరణ్య కశ్యపుడు దైత్య దానవులకు రాజై పట్టము గట్టుకొనుట-దైత్యుడమ రావతి నాక్రమించి యింద్రుని సర్వసంపదలు హరించి, దిక్పాలకులను పరాభవించుట గలదు.

ఇంద్రాది దేవతలు దేవగురునితో కర్తవ్యం బాలో చించుట, నారాయణుడే శరణ్యమని దేవగురుడు హరిమంది రమునకు బోవుదమని బృందారకులతో జెప్పుటతో ద్వితీ యాశ్వాసము సమాప్త మగుచున్నది.

## తృతీయాశ్వాసము-కథావృత్తాంతము

నృసింహ పురాణము తృతీయాశ్వాసము నందు దేవతలు దేవదేవుని దర్శించి స్తుతించుట, దైత్యుని వలన గలిగిన కష్టములను విన్నవించుకొనుట-దేవదేవుడు నమరుల నోదార్చి పంపుట గలదు.

దైత్యు డచ్చట విలాసములలో నోలాడుట, వసంతా గమనము, గ్రీష్మఋతు వర్ణనము, చంద్రోదయ చంద్రాస్తమయ వర్ణనలు, మధుపాన మత్తచిత్తలైన సుందరీమణుల వర్ణనము లిందుగలవు.

దైత్యుడు హృదయ దయితతో సుప్తినొందుట-లీలావతి కలగాంచుట-గురుడైన శుక్రాచార్యునితో దెలుపుట-కావ్యుడు లీలావతితో ధైర్యవచనములు బలుకుట గలదు.

దైత్యరాజసతి నెలదప్పుట - ప్రహ్లాదుద్భవించుట-హిరణ్యకశ్యపుడు ప్రహ్లాదునకు జాత కర్మాదులు గావించుట-ప్రహ్లాదుడు విష్ణుభక్తితో వర్థిల్లుట తృతీయాశ్వాసము నందు గాన నగును.

## చతుర్థాశ్వాసము-కథావృత్తాంతము

చౌల మౌంజీబంధ సంస్కారములు ప్రహ్లాదునకు గావించుట-గురుగృహమునకు విద్యాభ్యాసమునకు బంపుట, కొన్నాళ్ళ తరువాత కుమారుని విద్యాపాటవమును బరీక్షింప ప్రహ్లాదుని బిలువనంపుట- ప్రహ్లాదుడు శ్రీహరిని ప్రశంసించుట గలదు.

తండ్రి కుమారునిపై కోపించి, ఉపాధ్యాయులపై మండిబడుట ఉపాధ్యాయుని సమాధానము, మఱల గురు గృహంబునకు బంపుట-మఱికొన్నాళ్ళకు కుమారుని బరీక్షింప బిలువనంపుట-ప్రహ్లాదుడు పూర్వమువలెనే హరిభక్తి నుపన్యసించుట గలదు.

తండ్రి కొమరుని యనేక విధముల హింసించుట, హరి మహిమచే ప్రహ్లాదుడు సురక్షితుడగుట-మరల ప్రహ్లాదుని ఉపాధ్యాయులు గొనిపోయి శిక్షించుట జరుగును. ప్రహ్లాదుడు గురువులు లేని సమయమున తోడి బాలురకు హరిభక్తి నుపన్యసించుట జరుగును

మఱల దైత్యుడు కుమారుని బిలిచి నయశాస్త్రమును గుఱించి ప్రశ్నించును. ప్రహ్లాదు డాత్మ విద్యను గుఱించి ప్రవచించును. తండ్రి కోపించి కుమారుని వక్షస్థలమున దన్నును. ఇంక ననేక విధముల కుమారుని గష్టపెట్టుటకు యత్నించును. ఆ ప్రయత్నములన్నియు వ్యర్థమగుటతో నీ చతుర్థాశ్వాసము సమాప్త మగుచున్నది.

## పంచమాశ్వాసము-కథావృత్తాంతము

నృసింహ పురాణము పంచమాశ్వాసము నందు ప్రహ్లాదు నెచటికైనను వెడలనడుపుదమని దైత్యుడు శుక్రునితో మంతనము లాడును. శుక్రుడు ప్రహ్లాదు రావించి తండ్రి మాట వినుమని కోరును. ప్రహ్లాదుడు హరిభక్తి నుపన్యసించుట గలదు. దైత్యుడు ప్రహ్లాదుని యనేక విధముల బాధించును. హరి మహిమచే వానినుండి రక్షింపబడుచుండును.

హిరణ్యకశ్యపుడు హరి యెందున్నాడని ప్రహ్లాదుని ప్రశ్నించుట - హరి సర్వవ్యాపకుడని బదులు పలుకుట- ఇందు జూపుమని రక్కసుడు స్తంభమును బగుల గొట్టుట- శ్రీ నరసింహావతారము ఆవిర్భవించుట జరుగును - హరిని శరణు వేడుమని కొడుకు తండ్రిని కోరుట-దైత్యుడు తన సైన్యముతో హరి నెదుర్కొనుట—అయ్యనంత తేజో రాశి యందు దైత్యుని సైన్యమంతయు నిరాసంబునొందుట శ్రీ నృసింహ దేవుడు దితిపట్టిని సంహరించుట-సాధుజనుల సంతోషము-హరిని కీర్తించుట-నరసింహామూర్తి ప్రహ్లాదుని కటాక్షించుట గలదు.

దైత్యుని వధించిన యా ప్రదేశమంతయు అహోబల క్షేత్రముగా ప్రసిద్ధి నొందునని హరి పలుకుట-లోకైకమాత ఆదిలక్ష్మి యచ్చటికి వచ్చి హరి యంకమును జేరుట- బ్రహ్మాది దేవతలు నరసింహ స్వామిని స్తుతించుట - అహో బలతీర్థమహాత్మ్య వర్ణనలతో నీపంచమాశ్వాసము సమాప్త మగుచున్నది.

## పోతన ప్రహ్లాద చరిత్రము - కథా విషయములు

ప్రాయోపవిష్టుడయిన పరీక్షిన్నరేంద్రునకు శుక యోగి భాగవతార్థములు సెప్పుటతో పోతన ప్రహ్లాద చరిత్ర ప్రారంభమగును. రాజసూయ యాగసమయమున నారదుడు ధర్మనందనునకు హిరణ్యాక్ష హిరణ్యకశ్యపుల జన్మవృత్తాంతము జెప్పినట్లుగా శ్రీమదాంధ్ర భాగవతమున సప్తమాశ్వాసమున గలదు.

హరిద్వార పాలకులు విప్రశాపము వలన దితి గర్భమున హిరణ్యాక్ష హిరణ్యకశ్యపులుగా జన్మింతురు. తమ్ముడైన హిరణ్యాక్షుని క్రోడరూపమున హరి వధించినందులకు హరిపై కక్ష వహించును. వేదవర్ణాశ్రమ ధర్మములను నాశ మొందింపుడని యనుచరుల కాజ్ఞాపించును.

పుత్రశోకమున నున్న తల్లిని దైత్యు డోదార్చును. ప్రేతబంధు - యమ సంవాదమును సుయజ్ఞోపాఖ్యానమును, కుళింగపక్షుల కథావృత్తాంతమును వినిపించును.

లోకాధిపత్యము సాధించుటకై రక్కసుడు యజుని గుఱించి తపమాచరించును. దేవతలు వెఱగంది యజునకు విన్నవించుకొనగా వారలకు ధైర్యవచనములు బలుకును.

కమలజుడు హిరణ్యకశ్యపునకు ప్రత్యక్షమై దుర్లభములైన వరముల నిచ్చును. దైత్యుడు గర్వముతో సకల లోకములను బాధించుట-దేవతలు హరిని ప్రార్థింతురు. శ్రీహరి దేవతల కభయ మిచ్చును.

హిరణ్య కశ్యపునకు ప్రహ్లాదుడు హరిభక్తునిగా జనన మొందుట జరుగును. శుక్ర కుమారులైన చండామార్కుల వద్ద విద్యాభ్యాసమునకు ప్రహ్లాదుని బంపును. కొన్నాళ్ళ తరువాత దైత్యుడు కుమారుని బిలువనంపి విద్యాపరీక్ష గావించుట - కుమారుడు వైకుంఠుని బొగడుట జరుగును. దైత్యుడు కుమారునేగాక గురువులనుగూడ గోపించును.

గురువులు ప్రహ్లాదుని మఱల జదివింతుమని గొంపోవుదురు. దైత్యుడు మఱల కొన్నాళ్ళకు కుమారుని బిలువ

నంపి విద్యాపరీక్ష గావించుట - అతడు మఱల వైకుంఠుని బొగడుట జరుగును.

హిరణ్యకశ్యపుడంతట కొడుకని భావింపక అనేక విధములుగా హింసించును. హరిమాయచే వానినన్నింటి నుండి రక్షింప బడుచుండును. మఱల గురువులు ప్రహ్లాదుని నయశాస్త్రమును బోధింతుమని మఱల తమ గృహమునకు కొనిపోవుదురు. ప్రహ్లాదు డచ్చట గురువులు లేనిసమయమున సంగడి కాండ్రకు మునిమతమును బోధించును.

సంగడికాండ్రు యీ వింత ప్రకాశము నీ కెట్లు వచ్చినదని ప్రశ్నింపగా ప్రహ్లాదుడు తల్లి గర్భమున నున్నప్పుడే నారదుని కృపవలన నాకీ వింత ప్రకాశము గలిగినదని యానాడు జరిగిన వృత్తాంతమును నసుర బాలకులకు విప్పి జెప్పెను.

తన తండ్రి తపమునకై మందరాచలమునకు బోయి నప్పుడు తన తల్లిని యింద్రుడు చెరబట్టెననియు, దారిలో నారదుడు తన తల్లిని తన యాశ్రమమునకు గొంపోయె ననియు, ఆ సమయమున తాను గర్భస్థశిశువుగా నుంటి ననియు, తన తల్లికి నారదుడు మునిమతమును బోధించు సమయమున గర్భస్థ శిశువుగా వింటిననియు, అది తన కేనాటికి మఱపురానిదనియు బలుకును.

ప్రహ్లాదు డసురబాలకులకు ముని మతమును బోధించి పాడుచేయుచున్నాడని దైత్యుడు విని ప్రహ్లాదుని రావించి హరి యెచ్చట నున్నాడని ప్రశ్నించును. హరి సర్వాంత

ర్స్వామియని ప్రహ్లాదుడు పలుకగ ఈ స్తంభమున హరిని జూపుమని స్తంభమును బ్రద్దలు గొట్టును. నరసింహావతారమున హరి యావిర్భవించును. దితి పట్టిని బట్టి సంహరించును. దేవతలు పూలవానలు కురియుదురు. బ్రహ్మాది దేవతలు స్వామిని స్తుతింతురు. ప్రహ్లాదుడు నృసింహ మూర్తిని తన స్తుతి వచనములచే శాంతింపజేయును. నరసింహ దేవుడు బ్రహ్మాది దేవతలను, ప్రహ్లాదుని కటాక్షించుటతో ప్రహ్లాద చరిత్ర సమాప్త మగుచున్నది.

ఆంధ్ర మహాభాగవతములో నీ ప్రహ్లాద చరిత్ర సప్తమాశ్వాసములో గలదు-ఈ కథాభాగమున భక్తిరసము ప్రావృట్కాలమున ప్రవహించు నదీ తరంగములవలె పొంగి పొరలుచుండును. తెలుగు ప్రజలీ కథాభాగమును భక్తి శ్రద్ధలతో బఠింతురు.

## ఎఱ్ఱన నృసింహ పురాణము - మధుర కల్పనలు

ప్రబంధ పరమేశ్వరుడైన యెఱ్ఱాప్రెగడ తన పితామహునియాత్మశాంతికై లక్ష్మీనరసింహావతారమను పురాణ కథను రచించెను. దానికే నృసింహ పురాణ మని లోకమున పేరువడెను.

ఈగ్రంథమునందు బ్రహ్మాండాది పురాణములలో గల స్వల్పాల్ప కథాంశమును గైకొని ప్రబంధ రీతిగా కృతిని నిర్మించెను. గ్రంథమునంతను వర్ణలతోను, నూతన కథాంశములతోను మనీషులు మెచ్చునట్లు కృతి నిర్మించెను.

ప్రథమ, ద్వితీయ తృతీయా శ్వాసములు ఎఱ్ఱాప్రెగడ ప్రతిభాజనితములని చెప్పవచ్చును. చతుర్థ పంచమాశ్వాసములు విష్ణుపురాణములోని కథాంశములను గైకొని విస్తరించి వ్రాసెను. కథాంతమున అహోబలతీర్థమహాత్మ్యమును తాను కన్నదీ-విన్నదీ చేర్చిముగించెను.

ఎఱ్ఱాప్రెగడ పురాణాంతర్గతమగు నీ కథాంశమును గైకొని తన మధుర కల్పనలతోను, నూతన కథాంశములను జేర్చుటతోడను తెలుగున ప్రబంధ కవితా రీతికి నాందీ గీతమును బాడిన వాడాయెను. తరువాతి కవులకు నాదర్శ ప్రాయుడాయెను. ఈ నృసింహపురాణమును రచించుట చేతనే యెఱ్ఱన ప్రబంధ పరమేశ్వరుడను ప్రఖ్యాతిని బొందెను. ఇందు ఎఱ్ఱన ప్రవేశపెట్టిన మధురకల్పన లెవ్వియో పరిశీలింతము.

ప్రథమాశ్వాసములోని మధుర కల్పనలు

నృసింహ పురాణము ప్రథమాశ్వాసమున 112 గద్య పద్యములు గలవు. బ్రహ్మాండాది పురాణములలోగల స్వల్పాల్ప కథాభాగమును వర్ణనలతో విస్తరించి వ్రాసెను. దుగ్ధపారావారమును, శ్వేతద్వీపమును, శ్వేతద్వీపవాసులను వర్ణించును. అందుగల వైకుంఠ పురమును, ప్రభువైన శ్రీమన్నారాయణుని వర్ణించును. మున్నీటి ముద్దు కూతును వర్ణించును. శరదాగమనము, విష్ణువు మేల్కాంచుట, మున్నగు వర్ణనాత్మకములైన కథాభాగములన్నియు ఎఱ్ఱాప్రెగడ మేధాజనితములు. ప్రబంధ కవితా రీతి యిందు

తొంగిచూచు చున్నది. ఇందలి వర్ణనము లన్నియు ప్రౌఢ కవితా రీతిని వికసిల్లి రసానందమును గలిగించుచున్నవి. భావనా జగత్తులో విహరింప జేయుచున్నవి.

విప్రశాపముతో నీ ప్రథమాశ్వాసము సమాప్త మగుచున్నది. ఈ కథాభాగము ఉభయ ప్రహ్లాదచరిత్రలందు గలదు.

## ద్వితీయాశ్వాసములోని మధుర కల్పనలు

నృసింహ పురాణము ద్వితీయాశ్వాసమునందు 150 గద్య పద్యము లు గలవు. జయ విజయులు హిరణ్యకశ్యప-హిరణ్యాక్షులుగా దితి గర్భమున బుట్టుట- హిరణ్యకశ్యపుడు లోకాధి పత్యము నకై అజుని గుఱించి తప మాచరించుట, దుర్లభములైన వరములను బొందుట - లోకకంటకు డగుట - దేవతలు దైత్యునకు భయపడి హరిమందిరమునకు బోవుట - యీ ద్వితీయాశ్వాసమున గల కథాభాగము.

ఈస్వల్పాల్ప కథాంశమును గైకొని వర్ణనాత్మకము గా ఆశ్వాసమంతయు తీర్చిదిద్దెను. ప్రబంధరీతిని వర్ణించుటయే గాక ఒక నూతన కథాంశము ను గూడ నిందు ప్రవేశపెట్టెను.

పురందరుడు రంభాద్యప్సరసలను దైత్యుని తపోభంగ మునకై గంధమాదనమునకు బంపుట- ఆకస్మిక వసంతాగమ నము- అచ్చరల యాటపాటలు- వారిశృంగార చేష్టలు-హావ భావములు- అవన్నియు నసుర నాకర్షింప లేకపోవుట- అచ్చ రలు సిగ్గుపడుట - ఈ కల్పించిన కథాభాగము ఎఱ్ఱన మేధా జనితము. శృంగార భూయిష్టమైన యీ మధుర కల్పనలను

కబ్బమున ప్రవేశబెట్టుటతో రసానందమును గలిగించు చున్నది. ఎట్టిన ఈ కల్పనా కథాంశమును తన పురాణకథకు జతచేయుటచే గ్రంథము కావ్యశోభ నలంకరించు కొను చున్నది.

త్రుతీయాశ్వాసములోని మధుర కల్పనలు

నృసింహ పురాణము తృతీయాశ్వాసమున 165 గద్య పద్యములు గలవు. ఇందు వసంతా గమనము - గ్రీష్మర్తు వర్ణనము - వెన్నెల రాత్రులు, మైరేయపాన మత్తచిత్త లైనసుందరీమణులవర్ణనలు - వారి హావభావములు - విలాస ములు గలవు.

దైత్యుడుహృదయదయతతో సుఖినొందుట-దైత్యుని సతి కలగాంచుట - శుక్రాచార్యునితో స్వప్నవృత్తాంత మును జెప్పుట - అతడు లీలావతికి ధైర్యమును జెప్పుట - దైత్యుని హృదయ దయిత నెల దప్పుట - ప్రహ్లాదుడు జన్మించుట - హరిభక్తునిగా అభ్యుదయము నొందుట తృతీయాశ్వాసము నందలి కథాభాగము.

ఈ యాశ్వాసమంతయు కావ్యవస్తు సామాగ్రితో కిక్కిరిసియుండును. శృంగార భూయిష్టములైన వర్ణనములు కుప్పలు కుప్పలుగా నుండును. పాఠకుని ఆనంద రసతరం గములలో నోలాడించును. లోకోత్తరములైన ప్రకృతిసౌంద ర్యములను దర్శింపజేయును.

ఈ తృతీయాశ్వాసమున నించుమించు నష్టాదశ వర్ణ నములలో చాలవఱకు గలవని భావింపవచ్చును. ఆశ్వాస

మంతయు వర్ణనములతో నిండియుండును. మైరేయపాన మత్తచిత్తలైన సుందరీమణుల వర్ణనము వారి హావభావములు విలాసములు ఎఱ్ఱన ప్రవేశపెట్టిన మఱియొక నూతన కథాంశ మని చెప్పవచ్చును. శృంగార భూయిష్టమైన యీ కథాంశమును ప్రవేశ బెట్టుటతో కబ్బము మఱింత కావ్యశోభ నలంకరించుకొనుచున్నది. అశ్వాసమంతయు ప్రబంధసామాగ్రియే కనిపించును.

## చతుర్థాశ్వాసములోని మధుర కల్పనలు

చతుర్థాశ్వాసమున 190 గద్య పద్యములు గలవు. ఇందుగల కథాభాగము పోతన ప్రహ్లాద చరిత్ర యందును చిన్నచిన్న మార్పులతో కూడియుండును.

ఇందు ప్రహ్లాదుని యక్షరాభ్యాసము - విద్యాపరీక్ష- ప్రహ్లాదుడు హరిభక్తిని వీడకపోవుట - తండ్రి హింసించుట హరి మాయచే ప్రహ్లాదుడు వాని నన్నింటి నుండి రక్షింపబడుట యీ చతుర్థాశ్వాసము నందలి కథాభాగము.

పోతన ప్రహ్లాదయందు ప్రహ్లాదుని హింసించుట రెండు మూడు సీస పద్యములలో జెప్పబడినది. తండ్రిబెట్టిన యట్టి హింసలనే యెఱ్ఱన యొక యాశ్వాసమంతయును విస్తరించి వ్రాసెను. ఈ యాశ్వాసమునందు కల్పనలకంటే కథావస్తువున కధిక ప్రాధాన్య మిచ్చెను. అయినను నీ యాశ్వాసమున సుందరవస్తు వర్ణనల కెచ్చటవకాశము గలుగునో యచ్చట వర్ణించి ఆనంద తరంగములలో నోలాడించును.

కృత్య నుండియు, యమధర్మరాజునుండియు, ప్రహ్లాదుడు రక్షింబడుట మున్నగు విషయములు చిన్న చిన్న కథాంశములుగా నున్నవి.

పంచమాశ్వాసములోని మధుర కల్పనలు

ఈ పంచమాశ్వాసమునందు 197 గద్య పద్యములు గలవు. 146 వ పద్యములవఱకు ప్రహ్లాదచరిత్రయును, మిగిలిన 51 పద్యములు అహోబల తీర్థ మహాత్మ్యమును వర్ణించునవియై యున్నవి.

ఈ యాశ్వాసమునందు తండ్రి మఱికొన్ని విధముల ప్రహ్లాదుని హింసించుట - హరిమాయచే రక్షింప బడుట - నరసింహావతార మావిర్భవించుట - దితిపట్టిని వధించుట - నరసింహ దేవుడు ప్రహ్లాదుని, మునులను, దేవతలను కాపాడుట గలదు.

ఉభయ ప్రహ్లాద చరిత్రల యందలి కథాభాగములు కొంచెమించుగా కలియుచున్నవి. కథాభాగమున కధిక ప్రాధాన్యమిచ్చి అవసర మొచ్చినపు డెల్ల వర్ణనలతో తన ప్రబంధ సామాగ్రిని ప్రదర్శించెను.

పిండితార్థ మేమనగా ఎఱ్ఱాప్రెగడ పురాణాంతర్గతమైన కథాంశములను గైకొని, అడుగడుగున వర్ణనలతోడను, నూతన కథాంశముల తోడను, చిన్నచిన్న విషయములను విస్తరించి ప్రబంధ రీతిని యభివర్ణించెను. అహోబల తీర్థ మహాత్మ్యమును 51 పద్యములతో నభివర్ణించి కథాంతమున

సమకూర్చెను. ఈ విధముగా పంచమాశ్వాసములతో కూడిన నృసింహపురాణము కావ్యరీతిని శోభిల్లుచు రసానందమును గలిగించు చున్నది.

## ఎఱ్ఱన ప్రహ్లాద చరిత్రయందలి కథావిశేషములు

(పోతన ప్రహ్లాద చరిత్ర యందు లేనివి)

(1) నైమిశారణ్యము నందలి మునులు రోమహర్షణుని వలన బ్రహ్మాండాది పురాణమునుండి తీర్థభాగ మహాత్మ్యము వినుట.

(2) గాలవుడనుముని సకల క్షేత్రములను దర్శించి, యహోబలమునకు వచ్చి దేవశ్రవుని వలన అహోబల క్షేత్ర మహాత్మ్యమును వినుట. అట్టి కథాభాగమునే ఎఱ్ఱాప్రెగడ లక్ష్మీనరసింహావతార మను పురాణకథను రచించెను.

(3) దుగ్ధపారావారము, శ్వేతద్వీపము, శ్వేతద్వీప వాసులు, వైకుంఠ పురవర్ణనములు గలవు. శ్రీ మహావిష్ణువును, లక్ష్మీదేవిని వర్ణించుటగలదు. శరదాగమనము, శ్రీ మహా విష్ణువు మేల్కాంచుట, ఈ విషయములు నృసింహ పురాణమున గలవు. పోతన భాగవతమందు లేవు!

(4) దైత్యుని తపమునకు వెఱచి దేవేంద్రుడు దేవగురు నాశ్రయించుట, బృహస్పతి ధైర్యవచనములు పురందరునకు జెప్పి నారాయణమంత్ర ముపదేశించుట గలదు.

(5) రంభాద్యప్సరసలను దైత్యుని తపోభంగమును జేయుటకు గంధమాదనమునకు దేవేంద్రుడు బంపుట. అచ్చ

రల యాట పాటలు, విలాసములు, దైత్యు నాకర్షింప లేక పోవుట, అచ్చరలు సిగ్గుపడుట - ఈ కథాభాగమంతయు ఎఱ్ఱన మధుర కల్పన. పోతన ప్రహ్లాదయందు లేదు.

(6) దైత్యుని బాధలు పడలేక దేవతలు హరిమందిరమునకు బోవుట.

(7) సకల లోకములను జయించి దైత్యుడు విలాసములలో ప్రొద్దుపుచ్చుట - వసంతాగమ గ్రీష్మర్తు వర్ణనములు - ఉభయ సంధ్యల వర్ణనములు - చంద్రాస్తమయ చంద్రోదయ వర్ణనములు - ఇంకను అనేకములైన వర్ణనములు గలవు. మైరేయపాన మత్తచిత్తలైన సుందరీమణుల వర్ణనములు -అసురుడు హృదయదయితతో సుప్తినొందుట- అసురభామిని కల గాంచుట - గురువైన శుక్రాచార్యులతో జెప్పుట - శుక్రాచార్యులు లీలావతికి ధైర్యమును జెప్పుట- దైత్యరాజసతికి ప్రహ్లాదు డుద్భవించుట - ప్రహ్లాదునకు జాతకర్మ చౌలోపనయనాదులను గావించుట - ఈ కథాభాగ మంతయు ఎఱ్ఱన ప్రవేశపెట్టిన కథాభాగములని చెప్పవచ్చును.

(8) కృత్య నుత్పాదించి ప్రహ్లాదుని పైకి బంపుట - ప్రహ్లాదుడు హరిమాయచే రక్షింప బడుట గలదు.

(9) తండ్రి ప్రహ్లాదుని వక్షస్థలమున దన్నుట గలదు.

(10) శుక్రాచార్యులు తండ్రి మాట వినుమని ప్రహ్లాదుని గోరుట - ప్రహ్లాదుడు హరిభక్తి నుపన్యసించుట నిందు గలవు.

(11) శ్రీ నృసింహమూర్తి స్తంభోద్భవమై నప్పుడు హరిని శరణు వేడుమని ప్రహ్లాదుడు తండ్రిని కోరుట.

(12) హిరణ్యకశ్యపుని వధించిన యీ స్థల మహోబల క్షేత్రముగా ప్రసిద్ధి నొందునని స్వామి యాజ్ఞాపించుట.

(13) అహోబల క్షేత్రమహిమ వర్ణించుట.

పై విషయము లన్నియు భాగవత ప్రహ్లాద యందు లేవు. ఎఱ్ఱన తన నృసింహపురాణమున మధుర కల్పనలతో ప్రవేశ పెట్టెను. కావ్య సౌందర్యమునకు చేసిన ప్రయత్నములని భావింపవచ్చును.

## పోతన ప్రహ్లాద చరిత్ర యందలి కథావిశేషములు

(ఎఱ్ఱన నృసింహ పురాణమునందు లేనివి)

(1) పరీక్షన్నరేంద్రునకు శుకయోగి భాగవతార్థములను జెప్పుట ధర్మరాజునకు రాజసూయ యాగ సమయమున నారదుడు హిరణ్యాక్ష హిరణ్యకశ్యపుల పూర్వజన్మ వృత్తాంతమును దెలుపుట.

(2) శ్రీహరి హిరణ్యాక్షుని క్రోడరూపమున వధించుట.

(3) హిరణ్యకశ్యపుడు తల్లి నోదార్చుట - ప్రేత బంధు యమసంవాదమను సుయజ్ఞోపాఖ్యానమును దెలుపుట.

(4) కుళింగ పక్షుల కథావృత్తాంతము.

(5) హిరణ్యకశ్యపుడు తపమునకు మందరాచలమునకు బోయినపుడు దేవేంద్రుడు లీలావతిని చెఱబట్టుట - నారదుడు లీలావతిని చెఱ విడిపించి తన యాశ్రమమునకు గొనిపోవుట - ఆశ్రమమున లీలావతి నారదునకు శుశ్రూష జేయుట - నారదుడు దైత్య రాజసతికి మునిమతమును వినిపించుట - గర్భస్థ శిశువుగా నున్న ప్రహ్లాదుడు వినుట - ఈ కథాభాగమంతయు ఎఱ్ఱన ప్రహ్లాదయందు లేదు.

(6) బ్రహ్మాది దేవతలు నరసింహ దేవుని వేఱు వేఱుగా స్తుతించుట గలదు.

(7) లక్ష్మీదేవి స్వామి యుగ్రరూపమును జూచి వెనుకంజ వేయుట.

పై విషయములు నృసింహ పురాణమున లేవు.

## ఎఱ్ఱన - పోతనల ప్రహ్లాద చరిత్రములు

(సామ్యములైన కొన్ని విషయములు)

ఎఱ్ఱన — పోతనల ప్రహ్లాద చరిత్రములయందు కొన్ని సమానమైన విషయములు గలవు.

(1) నృసింహపురాణమున దేవశ్రవుడు గాలవునకు జెప్పిన యహోబల తీర్థమహాత్మ్యము రోమహర్షణుడు మునులకు జెప్పినట్లు గలదు.

పోతన ప్రహ్లాదయందు రాజసూయ యాగ సమయమున నారదుడు ధర్మజునకు జెప్పినదానిని శుకయోగి, పరీక్షన్నరేంద్రునకు జెప్పినట్లు గలదు.

(2) హిరణ్యకశ్యపుడు 'అసురుల తల్లికంటెను మదంబ గరిష్ఠ' కావున స్వర్గాధిపత్యము తనకుకావలెనను కాంక్షతో హరితోడను, నమరులతోడను వైరము బెట్టుకొనినట్లు నృసింహ పురాణమున గలదు.

భాగవత ప్రహ్లాదయందు తమ్ముడైన హిరణ్యాక్షుని క్రోడరూపమున వధించుటందులకు కోపించి హరి తోడను, అసురులతోడను వైరము బూనినట్లు గలదు.

(3) ఎఱ్ఱన కథయందు హిరణ్య కశ్యపుడు తపమునకై గంధమాదనమునకు బోయినట్లును, పోతన కథయందు మందరాచలమునకు బోయినట్లు గలదు.

(4) దైత్యుడు తపమాచరించుట - అజుడు దుర్లభములైన వరములిచ్చుట - దైత్యుడు లోక కంటకుడగుట రెండింటియందును నొక్కే తీరున గలదు.

(5) ప్రహ్లాదాభ్యుదయమును గుఱించి నృసింహాపురాణమున వివరముగ వర్ణింప బడినవి.

పోతనకథయం దట్లుగాక 'తనయందు నఖిల భూతములందు నొకభంగి' అను పద్యముతో ప్రహ్లాద చరిత్ర ప్రారంభింప బడినది.

(6) విద్యాభ్యాసమునకు గురుగృహమునకు బాలుని బంపుట, కొన్నాళ్ళ తరువాత విద్యా పరీక్షకై తండ్రి కొడుకును బిలువ నంపుట - ప్రహ్లాదుడు హరి భక్తి నుపన్య

సించుట - అసురుడు గురువుల గోపించుట - తమ తప్పే మియు లేదని గురువులు పలుకుట - రెండుకథలయందు నొక్క విధముగనే యున్నది.

(7) మఱల బాలుడు గురుగృహమునకు బోవుట - గురువులు లేని సమయమున తోడి బాలురకు మునిమతము నుపన్యసించుట - రెండంటి కథా గమనము సమానమే!

(8) ప్రహ్లాదుని విపరీత ప్రకృతి నసుర బాలకులు దైత్యునితో జెప్పినట్లు నృసింహ పురాణమున గలదు.

పోతన కథయందు గురువులే దైత్యునకు జెప్పినట్లు గలదు.

(9) తండ్రి కొడుకును హింసించుట రెండు కథలయందును సమానమే. ఎఱ్ఱన కథయందు వివరముగా నొక యాశ్వాసమంతయు వర్ణింప బడినది. పోతన కథయందు రెండు మూడు సీస పద్యములలో జెప్పబడినది.

(10) నృసింహమూర్తి స్తంభమున యావిర్భవించుట - దైత్యుని వధించుట మున్నగు విషయము రెండింటియందును సమానములే!

(11) నృసింహ పురాణమున తండ్రి కుమారుని వక్షస్థలమున కోపించి తన్నుట గలదు. పోతన కథయందీ విషయము లేదు.

(12) నృసింహావతారమును పోతన కథయం దింద్రాది దేవతలు వేఱువేఱుగా స్తుతించినట్లు గలదు.

ఎఱ్ఱన కథయందు తృతీయాశ్వాసమున బృందారకులు హరి మందిరమున కేగినపుడు స్తుతించినట్లు గలదు. రెండింటి యందును సమానమే!

(13) నృసింహమూర్తిని శాంతింప జేయుటకు లక్ష్మీదేవి భయపడి వెనుకంజ వేసినట్లు పోతన కథయందు గలదు.

నృసింహ పురాణమునం దట్లుగాక లోకమాత ఆదిలక్ష్మి వచ్చి స్వామి యంకమున జేరినట్లు గలదు.

(14) హిరణ్యకశ్యపుడు తపస్సునకుబోవుట-ఇంద్రుడు దైత్యుని భార్య లీలావతిని జెఱబట్టుట - నారదు డామెను విడిపించి యాశ్రమమునకు దీసికొని పోవుట - మునిమతమును బోధించుట - గర్భస్థ శిశువుగానున్న ప్రహ్లాదుడు మునిమతమును వినుట మున్నగు విషయములు పోతన భాగవతమునందు గలవు. నృసింహపురాణమున ప్రహ్లాదుని హరిభక్తికి కారణము జన్మాంతర సంస్కార భావముగా నభివర్ణింపబడినది.

(15) లీలావతి గర్భవతిగా నున్నప్పుడు దైత్యుడు తపమునకు బోయినట్లు పోతన కథయందు గలదు. నృసింహపురాణమునం దట్లు గాక దైత్యుడు లోకాధీశ్వరుడై విలాస వైభవము లనుభవించు సమయమున లీలావతి ప్రహ్లాదుని బ్రసవించినట్లు గలదు.

విషయ మేమనగా నిరువురు మహాకవులకు ఒకే కథ మూలమగుటవలన కథా విషయమునందు స్వల్పమైన మార్పు చేర్పులున్నను భేదము లెక్కువగ లేవు. పోతన రచనావిధానము భాగవత ధర్మమును తెలుగువారి కందించుటయై యున్నది! భక్తిపరవశుడై కథను గొంత విస్తృత మొనరించినను సంస్కృత భాగవత మందున్నది యున్నట్లాంధ్రీకరించెను.

ఎఱ్ఱాప్రెగడ రచనా విధానము ప్రధాన లక్ష్య మది కాదు గదా! వర్ణనాత్మకముగా ప్రబంధరీతిని యభివర్ణించుట. పండితులు మెచ్చుకొనునట్లు ప్రౌఢ కావ్యముగా నిర్మించుట. ఎఱ్ఱనకు మఱియొక ధ్యేయ మహోబల తీర్థ మహాత్మ్యమును వర్ణించుట.

అందువలననే కథాభాగమున యడుగడుగున కల్పనలను గుదిగ్రుచ్చి, కొన్ని కథాభాగములను ప్రవేశపెట్టి పండితానందకరముగా గబ్బమునునిర్మించెను. ఎఱ్ఱనకూర్చిన వర్ణనములు, కథాభాగములు ప్రధానమైన కథకు మఱింత జీవమును బోసెనేగాని వికృతిని గలుగజేయలేదు గదా!

## ఎఱ్ఱన్నగారి కావ్యతత్వము - కవితా సామగ్రి

ఒక జాతియొక్క ఔన్నత్యమును, సంస్కృతిని దెలిసికొనవలయునన్న ఆ జాతి యొక్క భాషను బరిశీలించ వలసియున్నది. భాషయనగా నిచ్చట సాహిత్యమని యర్థము. సాహిత్యము ప్రజల జీవితమునకు అద్దము వంటిది. మంచి చెడ్డలన్నియు నందు గానవచ్చుచుండును. కవులే ఒక విధముగా జాతి నిర్మాతలు ! వైతాళికులు ! సూత్రధారులు !

నిజమునకు ఎఱ్ఱాప్రెగడ నన్నయ తిక్కనల తరువాత తెలుగు జాతిని, తెలుగు భాషను తీర్చిదిద్దిన సూత్రధారు

డనవచ్చును. అందువలననే కవిత్రయములో తృతీయుడై కావ్యజగత్తులో ప్రథముడైనాడు.

ఎఱ్ఱన మహాశిల్పి. వంకర టింకరగా నున్న కంకర రాతిని సహితము కమనీయ మూర్తిగా తీర్చిదిద్దగల ప్రతిభ గలవాడు. రంగులు లేకుండగనే రమణీయ చిత్రమును మన ముందు నిలుపగల చిత్రకారుడు. మధురాక్షర వాక్యవిన్యాసములతో కమనీయ కవితా సరస్వతిని మనకు సాక్షాత్కరింప జేయును.

అట్టి ఎఱ్ఱాప్రెగడ క్రీ. శ. 14 వ శతాబ్దమునకు జెందిన వాడై రెడ్డిరాజుల యాస్థానమం దుండెను. మూడు శతాబ్దముల పాటు మూలపడియున్న భారతారణ్య పర్వశేషమును పూర్తిగావించెను.

తెలుగుభాష స్వతంత్రకావ్య నిర్మాణశక్తి గల భాషగా రూపొందినదని భావించి, అందుకు నూతన యుగమునకు దారితీయు కావ్యతత్వము అవసరమని భావించి అందుకు వైతాళికుడై నృసింహ పురాణమును రచించెను. అందు భావనా సౌందర్యమును, ప్రకృతి వైభవమును, మనోజ్ఞ కల్పనా విశేషములను వెలువరించెను. పురాణాంతరతమగు ప్రహ్లాదుని చరిత్రను గైకొని తన మనోజ్ఞ భావములను, స్వతంత్రరచనా విశేషముల నందు జతజేసి కావ్యశోభను వెల్లివిరియ జేసెను.

పురాణాంతర్గమగు చిన్ని కథను గై కొనినప్పటికి తన యద్భుత వర్ణనలతో, కథాకల్పనలతో పాఠకుని భావముల నూయల నూగించును. భావనాబలముతో, మేథాశక్తితో

నవనవోన్మేషణమైన నవ్యభావములను నీలాకాశము క్రింది చుక్కలవలె మిలమిల మెఱపింప జేయును. వెన్నెల రేయి వేలకిరణములవలె యానందమును గలుగజేయును.

ప్రహ్లాద చరిత్రము పురాణములలో నున్నకథ యైనను ఎఱ్ఱాప్రెగడ దానిని కమనీయ కావ్యవస్తువుగా తీర్చి దిద్దెను. అష్టాదశ వర్ణనలు, శృంగారరసము, నాయికానాయకులు, లోకోత్తరముగా కథావృత్తాంతమును బూర్తిచేయుట మున్నగు విషయములు కావ్యమునకు కావలసిన పరికరములు. ఇట్టి విశేషములుగల కావ్యములు సంస్కృతమున గలవు.

తెలుగు సారస్వతమున గూడ నట్టి కావ్య తత్వమును ప్రవేశపెట్ట దలచినాడు ఎఱ్ఱన. అట్టి కవితా సామగ్రిని తెలుగున గూడ బ్రవేశపెట్టి నవ్యకవితా సరస్వతికి నివాళుల నీయ దలుచుకొనినాడు ఎఱ్ఱన.

అట్టి నూతన కావ్యనిర్మాణమునకు ఎఱ్ఱాప్రెగడ ఒక శృంగార కథాంశమును దీసికొని నిర్మింప వచ్చునుగదా !

మఱి యెందులకీ ప్రహ్లాద కథను చేపట్టినాడని ప్రశ్నింప వచ్చును.

ఒక్కసారిగా నే వస్తువును పరిపూర్ణ భాసురముగా నవతరింపదు. పూవులు పిందెలుగా మారి కాయలు పండ్లగును. నన్నయ తిక్కన కాలమున పూపిందెలుగా నున్న కావ్యతత్వము ఎఱ్ఱన కాలమునాటికి పందుమవారి ప్రబంధ యుగమునాటికి ఫలరసములుగా శోభిల్లినది.

ఎఱ్ఱన కవితకు బీజము భావుకత ! భూమినుండి ఆకాశమునకు, ఆకాశమునుండి భూమికి నెగిరి గంతులు వేయుదుము. నీలిమేఘములతో నాడుకొందుము. పాలసముద్రములోని తరగలవలె ఉవ్వెత్తునకు లేతుము. సూర్యోదయ కాలమున ఉషస్సునందలి రంగుల నలదుకొందుము. చంద్ర కాంతులలో స్నానము చేయుదుము. కోకిలలతో కలిసి కూయుదుము. చిలుకలతో పలుకుదుము. పుష్పవాటికలలో పూవులు కోసికొందుము. పుష్పొడులను జల్లుకొందుము. తేనెవాకలలో నీదులాడుదుము. భావనా జగత్తులో అచ్చరల యాటపాటలు వారి మనోజ్ఞ నర్తనలు దిలకింతుము. ఈ విధముగా భావనా జగత్తులో విహరింపజేసి బ్రహ్మానందమునకు సహోదరమైన రసానందమును గలుగజేసెడిది కావ్య తత్త్వము. తెలుగున అట్టి కావ్యతత్త్వమునకు వైతాళికుడు యెఱ్ఱన.

పై జెప్పిన విశేషములన్నియు నృసింహ పురాణమున జొప్పించి భావికవులకు నాదర్శప్రాయు డయ్యెను. కథాపురాణముల కంటె కావ్యతత్త్వము మానవుని మిక్కిలి యాకర్షించునని యెఱ్ఱన మతము.

అయితే యీ కావ్యతత్త్వమును గ్రహించుటకు కొంత సంస్కారము, భాషావిజ్ఞానములు కావలసి యుండును. అవి లేకపోయినచో భావనాజగత్తున కవి జెప్పిన మార్గమున విహరించుట కష్టము. అందులకే కావ్యము చదువుట కష్టము. కథ చదువుట తేలిక.

తెలుగున కావ్యరీతిని ప్రవేశపెట్టుటకు, కమనీయ కవితా శోభలు తెలుగున రాణింపజేయుటకు ఎఱ్ఱన ప్రయత్నించెను. పురాణాంతర్గతమగు కథను గైకొని విస్తరణము జేసి, వర్ణనాత్మకముగా ప్రబంధరీతిని తీర్చిదిద్దెను. పైజెప్పిన వర్ణనలన్నియు నృసింహ పురాణమున గలవు. కావ్యతత్త్వము—కవితా సామగ్రితో విలసిల్లిన గ్రంథము నృసింహ పురాణము. ప్రబంధ కవితా రీతిని తెనుఁగున మొట్టమొదట పాడినది మహాకవి ఎఱ్ఱాప్రెగడ !

యుగపురుషులను కాలమే సృజించును.

అందులకు ఎఱ్ఱాప్రెగడ నిదర్శనము.

## నృసింహపురాణమునందుగల ప్రబంధలక్షణములు

నృసింహ పురాణము నందుగల ప్రబంధ లక్షణములను, పురాణ లక్షణములను బరిశీలింతము. ముందుగా ప్రబంధ లక్షణములను గమనింతము.

(1) ఆశ్వాసములుగా కృతిని విభాగించుట.
(2) పీఠిక—ఇష్టదేవతా ప్రశంస-కృతిపతి ప్రశంస.
(3) దుగ్ధ పారావార వర్ణనము.
(4) శ్వేతద్వీపము—వైకుంఠపుర వర్ణనము.
(5) శరదాగమన వర్ణనము.
(6) నాయికా నాయకులైన లక్ష్మీనారాయణుల వర్ణనము.
(7) దైత్యుని జైత్రయాత్ర.
(8) అప్సరసల యాటపాటలు.

(9) అచ్చరల హావభావములు.
(10) ఆకస్మిక వసంతాగమనము.
(11) వసంతర్తు గ్రీష్మఋతువుల వర్ణనము.
(12) మైరేయపాన మత్తచిత్తలైన సుందరీమణుల హావభావములు.
(13) దైత్యుడు హృదయ దయితతో సుప్తినొందుట.
(14) చంద్రోదయ చంద్రాస్తమయ వర్ణనములు.
(15) పుత్రోదయము.
(16) ఉదయ-సాయం సంధ్యల వర్ణనలు.
(17) వెన్నెల రాత్రులు.
(18) లక్ష్మీనారాయణుల కూడిక.
(19) కావ్యము సుఖాంతముగా సమాప్తమగుట.
(20) వర్ణనాత్మకమైన కావ్యసామగ్రి.

నృసింహ పురాణము పరిపూర్ణమైన ప్రబంధము గాకపోయినప్పటికి కావ్యసామాగ్రి కావలసినంత గలదు. అందులకే ప్రబంధమని కొందఅందురు.

## పురాణ లక్షణములు

నృసింహ పురాణములోని పురాణ లక్షణములను బరిశీలింతము.

(1) బ్రహ్మాండాది పురాణముల నుండియు, విష్ణు పురాణము నుండియు కథ గైకొన బడినదని కవియే పీఠికలో

చేర్కొనుట - కొన్ని భాగములు విష్ణు పురాణము నుండి గ్రహింపబడినటుల స్పష్టమగుట-

(2) ప్రబంధమునకు గావలసిన శృంగార రసము లేకుండుట -

(3) నాయికా నాయకులు లేకుండుట-

(4) భక్తి రసమే ప్రధానముగా నుండుట-

(5) భీభత్స రసముగూడ చోటు చేసికొనుట-

(6) దండకమును బ్రవేశ పెట్టుట-

(7) దేవశ్రవుదు గాలవునకు జెప్పినదానిని రోమహర్షణుడు మునులకు జెప్పినట్లుండుట—

(8) అహోబల తీర్థ మహాత్మ్యము వర్ణింపబడుట-

(9) వేదాంత పార లౌకికములకు బ్రాధాన్యమిచ్చుట—

పై జెప్పిన విషయము లన్నియు నుండుట వలన గ్రంథమును బురాణమని జెప్పదురు. కవియే పురాణమని చెప్పెను. మనకు సందేహ మెందులకు?

నృసింహ పురాణము ప్రబంధ రీతిలోనున్న పురాణ గ్రంథము - అప్పకవి గూడ దీనిని పురాణ గ్రంథమని పేర్కొనెను. కాని ఎఱ్ఱన తన ప్రతిభా విశేషములతో కావ్యరీతిలో కొన్ని వర్ణనలను నూతన కథా భాగములను బ్రవేశ పెట్టెను. ఆ వర్ణనలలో కావ్య రీతికి కావలసిన అష్టాదశ వర్ణనలలో జాలవఱకు గలవు.

శృంగార నాయికా నాయకు లిందు లక్ష్మి నారాయణు లేయని చెప్పవచ్చును. దైత్యుడు హరిపై కోపించి దేవ బ్రాహ్మణులను, వర్ణాశ్రమ ధర్మములను ద్వేషించెను. తుదకా దైత్యుడు శ్రీహరిచే వధింపబడి ప్రహ్లాదుని భక్తికి అనగా ధర్మమునకు విజయము గలిగెను. శ్రీహరి లక్ష్మి దేవితో విడివడి శ్రీ నృసింహావతారమును నెత్తవలసి వచ్చినది. తుదకు శ్రీహరి దైత్యుని వధించి, అహోబలమునం దాశీనుడై యుండగా లోకమాత ఆదిలక్ష్మి వచ్చి శ్రీహరి యంకమున జేరుటతో శృంగార రసము వర్థిల్లుచున్నది.

ఇది కేవలము పురాణమనిగాని, ప్రబంధమనిగాని చెప్పుటకు వలనుగాదు. శ్రీ నృసింహావతారమువలె ప్రబంధ సామాగ్రితోనున్న పురాణ గ్రంథము!

# ఎఱ్ఱన్న గారి
# ప్రబంధ కవితా సామగ్రి

ఎఱ్ఱనభావుకుడు. కవి. పండితుడు. సరసబహుపురాణ ధర్మశాస్త్ర కథావిస్తరవేది. శివభక్తుడు. అద్వైతి. వేదాంతి. ఎఱ్ఱాప్రెగడ నృసింహ పురాణమున ప్రవేశపెట్టిన ప్రబంధ సామగ్రిని బరిశీలింతము. ముందుగా ఎఱ్ఱన్నగారి వాగ్భారతిని దర్శింతము.

చం॥ కరమలంబునందుఁ బటి
కంపుఁ గమండలు వచ్ఛకాంతి భా
సురమగు మౌక్తికంపు జప
సూత్రము దాల్చుచుట, బ్రహ్మవాదియై
పరఁగిన హంసముం బిలిచి
బాలమృణాళముఁ జూపు చందమౌ
సిరిఁ దిలకింప నొప్పు బుధ
సేవితమూర్తిఁ దలంతు భారతిన్ !

(నృ. పు. పీ. 6)

సాధారణముగా మనము సరస్వతీదేవిని వీణాపాణిగా దర్శింతుము. ఎఱ్ఱన్నగారి వాగ్భారతి ఒక చేతియందు కమండలమును, ఒక చేతియందు జప సూత్రమును ధరించినది. అదెట్లున్నదనగా బాలమృణాళమును జూపుచు హంసను బిలుచుచున్నదా యన్నట్లున్నది. ఎఱ్ఱన భావుకతకు, దివ్య

దృష్టికి నిదర్శనము! బుధులు సేవించు భారతి యట్లుండును గాబోలును!

చం॥ తటరుహవిద్రుమద్రుమ వి
తానము లొప్పఁ బయోధికింక ను
త్కట చటులోర్మి హస్తముల
గర్వమున న్వెడలంగఁ ద్రోచినం
బటుతర భావ మేది బహు
భంగి వికీర్ణత నొంది క్రింద న
చ్చట నచటన్ బొజుంగువడి
ప్రగ్గిన బాడబ కీలలో యనన్ !

(నృ. పు. 1-33)

పై పద్యము నృసింహ పురాణము ప్రథమాశ్వాసము లోనిది. అందు ఎఱ్ఱన్న పాల సముద్రమును వర్ణించును. ఆసందర్భములోనిది. సముద్రపు టొడ్డున పడియున్న ముత్యములు, పగడములు వికీర్ణతనుబొంది బాడబకీలలా యన్నట్లొప్పుచున్నవట! ధారాశుద్ధిని నన్నయగారి పద్యములను జ్ఞప్తికి దెచ్చుచున్నది.

ఉ॥ చుట్టును గల్పవృక్షములు
చుట్టును బుష్ప లతావితానముల్
చుట్టును కేలి శైలములు
చుట్టును సిద్ధ రసాంబు వాహినుల్
చుట్టును బూర్ణ దీర్ఘికలు
చుట్టును గోకిల కీరనాదముల్

చుట్టును హంసికా గతులు
సొంపెసఁగున్ హరి మందిరంబునన్ !

(నృ. పు. 1. 59)

ఉ॥ ఆడుదు రెల్లప్రొద్దు లలి
తాభినయంబుల దేవకామినుల్
పాడుదు రింపు వీనులకు
బందువ సేయఁగ వేడ్కఁ గిన్నరుల్
గూడి సమగ్ర తత్త్వరస
గోష్ఠి సుఖింతురు యోగిబృందముల్
క్రీడ యొనర్తు రిష్టరస
కీర్తితభంగిఁ బ్రసన్నులయ్యెడన్!

(నృ. పు. 1—61)

పై రెండు పద్యములు ఎఱ్ఱన్నగారి ద్రాక్షాపాక శైలికి నిదర్శనములు. హరిమందిర బాహ్యాభ్యంతర దృశ్యములను సాక్షాత్కరింపజేయుచున్నవి. శబ్దాలంకారములు మన హృదయమున మృదంగ ధ్వనులు సేయుచున్నవి.

చ॥ నిరుపమ భోగి తల్పమున
నిర్మలయోగ విశేషలీలమై
జలనిధి కన్యకామణి కు
చద్వయ కీలిత వక్షుఁడై మనో
హర సుఖవిద్రనున్న కమ
లాక్షుడు మేల్కనియె న్బయోధి పెం

దరఁగల గ్రమ్మోఁత మంగళ మృ
దంగ మృదు ధ్వనియై చెలంగఁగన్ !
(నృ. పు. 1-71

జలనిధి కన్యకామణి కుచద్వయ కీలితవక్షుఁడై యున్న దేవదేవుడు సుఖనిద్రనుండి మేల్కాంచెనట! శృంగారరస మేఱులు పారుచున్నది. తరగల గ్రమోతలు మంగళ మృదంగ ధ్వనులట! ఆహా! ఎంత చక్కని భావదృశ్యము!

చం॥ ఉరుతర తల్ప పన్నగ ఫ
ణోజ్జ్వల రత్న సహస్ర దీప్తిమైఁ
బరఁగఁ గరంబు బొల్పెసఁగఁ
బద్మదళాక్షుని మేను నూతన
స్ఫురదరుణాంశు రాగ రుచి
సూరెల బర్వఁగ నుల్లసిల్లు సుం
దర మహనీయ నీలవసు
ధాధర శృంగము పోల్పఁ బట్టఁగన్ !
(నృ. పు. 1-78)

శేషుని ఫణోజ్జ్వల రత్న సహస్రముతో ప్రకాశించుచున్న స్వామి శరీరము స్ఫురదరుణాంశు రాగరుచులతో సుందర మహనీయ నీల వసుధాధరమువలె ప్రకాశించుచున్న దట! ఎఱ్ఱన భావుకతకీ పద్యము అద్దము బట్టుచున్నది.

ఉ॥ పొందవు దుఃఖముల్ భయము
పొందదు పొందదు దైన్య మెమ్మెయిన్
బొందవు తీవ్ర దుర్దశలు
పొందు ప్రియంబులు పొందు సంపదల్

పొందు సమగ్ర సౌఖ్యములు
పొందు సమున్నత కీర్తు లెందు గో
విందు పదారవింద పదవీ
పరిణద్ధ గరిష్ఠ చిత్తులన్

(నృ. పు. 2-31)

ద్వితీయాశ్వాసమున దేవగురుడు దైత్యుని తపము నకు వెఱగందిన పురందరునకు నారాయణ మంత్ర ముపదే శించు సమయమున వలికిన పలుకులు! పద్యమెంత సహాజ ముగా పరువెత్తుచున్నదో గమనింపుడు!

ఉ॥ శ్రీస్తన కుంకుమద్రవ నిషిక్త
భుజాంతర భాగ విస్ఫుర
త్కౌస్తుభ రత్న నూత్న రుచి
గర్వితనాభి సరోజ సౌరభ
ప్రస్తుత మత్తభృంగ రవ
రాగ రసోల్బణ భోగి భోగ త
ల్పాస్తరణుం దలంచు సుకృ
తాత్ములపాస్త సమస్త కల్మషుల్!

(నృ.పు. 2-37)

హరిభక్తి ప్రాశస్త్యమును దెలుపుచు శృంగార రస మును జిలుకరించు చున్నది. ఛేకాలంకారముతో నొప్పి మృదంగ ధ్వనిని గలుగజేయు చున్నది.

ఉ॥ చన్నుఁ డసురేంద్రుఁ డున్న వికచ
చద్రుమ పుష్ప సుగంధి గంధమా

దన వన భూమికిన్ భవ దు
దంచిత యోగ్య సహాయలీలకై
పనిచెద నీ క్షణంబ మధు
వ్రజ కోకిల కీర మీన కే
తన మధుమానసాస్పద సు
ధాకర రక్షిణ మారుతంబులన్! (నృ.పు.2-54)

దైత్యుని తపోభంగమును జేయుటకై అప్సరసలను బంపుచు నింద్రుడు పలికిన పలుకులు! ఇందు జెప్పబడిన వస్తువు లన్నియు ప్రబంధ నిర్మాణమునకు సాధనములు. ప్రబంధ కవులకు కవి యందించిన కవితా సామగ్రి.

అకాల వసంతాగమనమును ఎఱ్ఱన ఎంత లలితముగా వర్ణించెనో జూడుడు.

ఉ॥ ఎందును బుష్ప సౌరభము
యెందును మంద మదాలి ఝుంకృతుల్
ఎందును సాంద్ర పల్లవము
లెందును గోకిల కంఠకూజితం
బెందును విస్ఫురత్ఫలము
లెందును గోమల కీర భాషితం
బందము లయ్యె మందమరు
దంచిత చారు వనాంతరంబులన్! (నృ.పు. 2-62)

చ॥ చిలుకలపిండు నొప్పిదము
చిత్ర సురాయుధ లీల యేపునం
జెలఁగ మధువ్రతావలుల
చిక్కని క్రొమ్మెఁతనుగర్జ ల్లులస

త్ఫలరసపూరముం దెరలఁ
బర్వుట సాధలుగాఁగ మేఘపం
క్తుల క్రియ నొప్పు భూరుహ
తతుల్ మధువేళఁ బయోద వేళనాన్!

(నృ.పు. 2-72)

ఎంత చక్కని ప్రకృతి దృశ్యములు! వసంత ఋతువును మన యెదుట ఎఱ్ఱన ప్రత్యక్షము గావించినాడు.

అటు జూడుడు కోకిల కూజితము లెంత మధురముగా వినిపించుచున్నవో!

చ॥ మనసిజ మంత్రఘోషములు
మన్మథు నానతిమాఁట లిందిరా
తనయు విలాసహాసములు
దర్పకు నార్పు లెలుంగు లంగజ
న్మని చదువుల్ మనోభవు
మోహన గీతు లనంగ జారు ఖే
లనములు నెల్ల దిక్కులఁ జె
లంగె! మదోత్కట కోకిల ధ్వనుల్!

(నృ.పు. 2-73)

ఎఱ్ఱన నృసింహ పురాణము ప్రబంధమని పేరు వడుటకు కారణమిట్టి ప్రబంధ సామగ్రి గ్రంథమునిండ యుండుటయే!

అటు జూడుడు! పురందరుడు బంపిన యచ్చరలు దైత్యు నెట్లాకర్షించు చున్నారో! కందుక క్రీడతో నొక యచ్చర లేమ యెట్లు వయ్యారములు వొలకబోయుచున్నదో!

చ॥ కదలఁ గుచద్వయంబు వడఁ
కన్దను మధ్యము కక్షదీధితుల్
చెదరఁగ మోము లేఁ జెమటఁ
జెన్నొదవన్ బొలపంబు గద్గవం
బొదలఁగఁ గంకణ స్వనము
పొల్పెసలార సుమాస్త్ర దర్పముల్
ముదరఁగ నల్లసిల్లె నొక
ముద్దియ కందుక ఖేలనంబునన్!

(నృ.పు. 2-79)

అదిగో అద్దమును జేతఁబట్టి తన యందమును జూచుకొనుచున్న లేమను గనుకొనుడు!

చ॥ వలపల డాపలన్ వరుస
వాలు గనుంగొనఁ జూపు లార్పుచున్
దిలకము దీర్చుచున్ గురులు
దీటుచు వీనుల మానికంపు టా
కులఁ బొరిఁ ద్రిప్పుచున్ దశన
కోరకము ల్వెలయంగ మోవి మె
ప్పలరఁగ మోము విచ్చుచును
నద్దముఁ జూచె నొకర్తు వేఁడుకన్!

(నృ.పు. 5-86)

చక్కని స్వభావోక్త్యలంకారములోనున్న పద్యము. బృందారకులు స్వామిని యెట్లు స్తుతించుచున్నారో గమనింపుడు!

ఉ॥ శ్రీ వసుధా కళత్ర యత
సీ సుమనోతి మనోజ్ఞగాత్ర మా
యావిహిత త్రిలోక నిగ
మార్థ వివేక విపాప భవ్య సం
సేవక సౌమ్యమానస వ
శీకృత రూప భవాంధకార ని
ర్ధావన దీప దీప్త నవ
తామరసేక్షణ విశ్వ రక్షణా!

(నృ.పు. 3-17)

పద్యము తృతీయా శ్వాసములోనిది.

ఎట్టన జూపుచున్న విశ్వరక్షకుని మనము ప్రత్యక్షముగా జూచుచున్నట్లు అనుభవము గలుగుచున్నది.

అదిగో! మైరేయపాన మత్తచిత్తలైన దైత్యాని సుందరీ మణుల హాసవిలాసములు గమనింపుడు!

చ॥ నెలఁత యొకర్తు చేతి హరి
నీల శిలామయ పాత్రిఁ బూర్ణసం
వలిత తరంగమై పొదలు
వారుణిఁ దోఁచు సుధాంశు మండలం
బలము కరాళ రాహు వద
నాహతి స్రుక్కె కరంబు! బిమ్మటిం
గలఁగి పొరింబొరిన్వడఁకు
కైవడి గానఁగనయ్యె నయ్యెడన్!

(నృ.పు. 3-96)

చ॥ పొలఁతుక యార్తె యొప్ప మధు
పూరిత పాత్రకుఁ గానవచ్చు న
జ్జ్వల హిమధాముచేతఁ దన
వక్త్రము కాంతికిఁ గాంతిపూరముల్
గలయఁగ దచ్చి తేర్చి యొడి
కంబుగఁ బుచ్చిన వెన్న కల్లుతోఁ
గలపి కరంచి క్రోలుటకుఁ
గా నిడికొన్న తెఱఁగు నందగన్!
(నృ. పు. 3-98)

తే॥ చషకమున గామినీ ముఖచంద్రుడును సు
ధాంశుఁడును బింబితాంగులై యలరు టొప్పె!
నర్థిఁ దమలోన జెలిమిసేయంగ శపథ
మునకు వనజ తనూజలో మునిగినట్లు! (నృ.పు.3-100)

పై పద్యము లన్నియు ఎఱ్ఱన్నగారి భావుకతకు, శృంగార ప్రబంధ రచనకు నుద్దీపికలు! పదునాఱవ శతాబ్ది ఆంధ్ర ప్రబంధ కవితా రచనకు వేసిన పూలతోటలు! చుక్కల ముగ్గులు వేసిన రాజబాటలు! అదిగో! చంద్రాస్త మయ మగుచున్నది! నీలాకాశమును గమనింపుడు.

ఉ॥ రాతిరి యెల్ల జారినను
రాగముతోడఁ గుముద్వతీ రతిన్
బ్రీతి భజించి ఖేదమునఁ
బ్రేయసియున్ సొగియంగ దాను ను
ద్భూత పరిశ్రమార్తుఁ డగు
పోలికఁ జంద్రుడు పశ్చిమాబ్ధి శ

య్యాతలసు ప్రికై దిగె స
నల్పవిభా విరళాంగ రాగుఁడై!
(నృ. పు. 3-108)

అదిగో! ప్రత్యూషసమీరణములు! ఎట్టి వర్ణించిన మధుర మంజుల వీచికలు! ఆఘ్రాణించి యానందింపుడు!

సీ॥ వెడవెడ మాతులు విచ్చు తామరలపై
సుడిసి నెత్తావులు సూఱలాడి!
యనుఁగుఁ దోఁటలు సొచ్చి యలరుతేనియఁ జేసి
యెలదేటి పదువులఁ జెలఁగి నడచి!
రాయంచకవల నిద్రలు దెల్పి కొలఁకులఁ
దరఁగ యుయ్యలయాఁట దగులుపఱచి
సోర్ణగండులు సొచ్చి సురతఖేదమునంటుఁ
జెలువులఁ జెలువుర నేదదీర్చి
గీ॥ యడరి గృహపతాకికలకు నాఁట గఱపి
ప్రోది నెమళుల యెఱకల పొదులువిప్పి
మంద సంచారముగ సుకుమార మగుచు
మెఱసెఁ బ్రత్యూష సమయ సమీరణంబు!
(నృ. పు. 3-111)

అదిగో! తూర్పు దెస నవారుణోదయ మగుచున్నది. దర్శింపుడు!

కం॥ రవిరాకకుఁ బూర్వదిశా
యువతి గృహాంగణము కుంకుమోదక సేక
ప్రవిభాతమయ్యె ననఁగా
నవారుణోదయ విజృంభణము విలసిల్లెన్!
(నృ. పు. 3-112)

అరుణోదయమైనదిగదా! అలినీ మంజుల గీతనాదముల నాలకింపుడు!

మ॥ అలినీ మంజుల గీతులుం బటుతరం
గాలోల నాదంబులున్
విలస త్కేసర లతావికీర్ణ సుమనో
వృష్టి ప్రచారంబులుం
కలహంసీ హసితాను లాపములునై
గంభీర పద్మాకరం
బులు గోకద్వయ సంగమోత్సవములం
బోల్పారెఁ గాల్యంబులై! (న్వ. పు. 3-115)

పద్మినీ ప్రియాతిలకము సు వీడి రాత్రియంతయు నిచ్చవచ్చినట్లు, యెచ్చటెచ్చటనో చరించి, నెమ్మది నెమ్మదిగా ప్రాన్ముఖమున సూర్యు డుదయించుచున్నాడు! మధ్యమ నాయకుని వర్ణనమిందు గానవచ్చుచున్నది. చూడుడు!

చ॥ అనితర కాంత బద్మినిఁ బ్రి
యాతిలకంబు మొఱంగిపోయి రే
యెనసిన వేడ్క నొండు దన
యిచ్చ మెయిన్విహరించి మేన నం
టిన నవరాగ లీల జిగి
దేరఁగ నోడి యొదింగి యొయ్యనొ
య్యన బొడసూపెనా నుదయ
మయ్యె బతంగుడు ప్రాన్ముఖంబునన్!

(న్వ. పు. 3-116)

బాలభానుని బంగారు కాంతులను నెట్టున్నగా రెంత యందముగా వర్ణించెనో జూడుడు!

సీ॥ కమనీయ దిగ్వధూ కర్ణ పల్లవములా
కాశ కింశుక కోరక ప్రతతులు!
వాసర వారణ వదన సిందూరముల్
వనరుహ కుంకుమోద్వ ర్తనములు!
కుముదినీ నవతపః క్రమ వల్కలంబులు
తిమిరాపహరణ ప్రదీప శిఖలు!
త్రైలోక్య మందిర రత్నతోరణములు
ప్రత్యూష సటరక్త పత్రకంబు!

ఆ॥ లనఁగ నూతనంబులై కెంపులై సొంపు
లలర మణిమరీచు లతిశయిల్ల!
నఖిల భువన మంజులాంజలి పుట పూజ్య
మానుఁడగుచు బాలభాను డొప్పె!

(నృ. పు. 3-117)

లోకములను జయించిన దైత్యు డెట్లు విలాసములలో దేలుచున్నాడో గమనింపుడు!

శా॥ వీణావేణు మృదంగ సంగత కళా
విన్యాసమున్ బంధుర
శ్రోణీ రమ్య ఘన స్తనీ నటన చారు
ప్రోక్షయున్ సంతత
ప్రాణప్రీణన గంధబంధ విలస
త్కాదంబరీ కేలియున్

ప్రాణంబు లన కొండెలుంగఁ దతఁ డె
బ్భంగిన్ సమస్తక్రియన్! (నృ. పు. 3-64)

దివిజ విహారభూములలో దైత్యుడు ప్రియతోఁగూడి ఎట్లు విహరించుచున్నాడో ఎఱ్ఱనగారి భావనాదృష్టిని గమనింపుడు! ఇదంతయు ప్రబంధసామగ్రియే యని చెప్ప వచ్చును.

సీ॥ అమృత శీకర సేక హరిత వనావలీ
సుందర మందిర కందరములు!
రత్న పుష్పామోద రమ్య కాంచనలతా
కోమల మేరు నికుంజములును!
కనకాంబుజక్షోద ఘనరుక్త వాలుకా
లలిత మందాకినీ పులినములను!
హంసకుటుంబ నిత్యావాస హేమాబ్జ
చారుమానస సరి త్తీరములును!
గీ॥ నాదిగాఁగల్గు దివిజ విహారభూము
లన్నియును దానవైయె వేడ్క లగ్గలింప!
ననుదినంబును నచ్చర లెన్నికఁ దిరుగఁ
దానుఁ బ్రియమును విహరించె దైత్యవిభుడు!
(నృ. పు. 3-65)

వసంతావసానంబున గ్రీష్మర్తు వర్ణనమును బరిశీలింపుడు?

ఉ॥ ఒయ్యన మాధవీ లతల
నుండుట లజ్జనఁ జేసెఁ దుమ్మెదల్

గ్రుయ్యాఁగఁ బాఱిబాటల త
రు ప్రకరంబుల మూఁగె నుక్కనన్
దియ్యని వింటికి స్మరుఁడు
దీసిన యమ్ములఁ గాన మెచ్చెఁ దా
నయ్యెడ మల్లె క్రొమ్మొగడ
తాపునఁ బాంథుల వేఁట లాటకున్
(నృ.పు. 3-66)

చ॥ మలయజ వారి సేకముల
మౌక్తిక నూతన హారలీలలన్
వలిపెపు సన్న కావులను
వారిరుహాక్షుల వీఁగుఁ జన్నులన్
గలిగిన చల్మిరిం బ్రతికెఁ
గాక జనావలి యిట్టివేసవిన్
గలదె శరణ్యమన్య మనఁ
గాఁ గడుఁ జేర్చె నిదాఘదాహముల్!
(నృ. పు. 3-67)

తే॥ అదిరిపాటున వేసవి పొదవికొనినఁ
గలఁగి తలఁగి పోనేరక మలయపవనుఁ
డిందుఁ దలదూర్చుకొనియు నా నింపొనర్చె
నమరు తాలవృంతముల మందానిలంబు!
(నృ. పు. 3-69)

తే॥ పగలు లెలతోఁట నీడలు భ్రాంతియయ్యెఁ
బగళులును రేలు దనుగాలి భ్రాంతియయ్యెఁ

రేలు వెన్నెల బయళులు ప్రియములయ్యె!
రేలుఁ బగళులు నిద్రలు ప్రియములయ్యె

(నృ. పు. 3-73)

అదిగో! అధర్మమను తమంబు తొలగి పోవుచున్నది. చంద్రోదయ మగుచున్నది గమనింపుడు.

సీ॥ తిమిర భూతము సోకు తెరల జగత్త్రయీ
లలన దాల్చిన రక్తతిలక మనఁగ!
సఖ్యంబునకు నిశాపతి యొసంగినఁ బ్రాచి
ప్రాపించు గురివింద బంతియనఁగఁ
దోయధి వెడఁ గుంకి తోఁచు పురందర
కుంభి సిందూరిత కుంభమనఁగఁ
గులిశాయుధుని బెద్ద కొలవున నెత్తిన
దీపించు మాణిక్యదీప మనఁగఁ

గీ॥ గుముదినీ రాగ రసబద్ధ గుళికయనఁగఁ
గామినీ రంజనౌషధ కబళ మనఁగ!
బొడవు బెంపున బింబంబు పొలుపు మిగులఁ
జంద్రుఁ డుదయించెఁగాంతి నిస్తంద్రుఁడగుచు!

(నృ. పు. 3-84)

రజనీకర బింబమునందు గల కళంకమును వెన్నునివలె ఎఱ్ఱన్నగారు దర్శించిన భావుకతను దర్శింపుడు.

ఉ॥ వెన్నెల వెల్లి పాల్కడలి
వ్రేఁకదనంబునఁ జేర్చి దిక్కులున్

మిన్నను ముంప నందు రజ
నీకరబింబము మండలీ భవ
త్పన్నగ తల్ప కల్పనము
భంగిఁ దనర్చెఁ దదంతరంబునన్
వెన్నునిభంగిఁ జూడ్కులను
వేడ్క యొనర్చి గళంక మత్తఱిన్!
(నృ. పు. 3-87)

నిండువెన్నెలలో కలువ లెట్లు వికసించి పుష్పొడి తేనియ లొల్కబోయుచున్నవో గమనింపుడు!

చం॥ వడిగొని తేకు లుప్పతిల
వాలిన కేసరమున్ దలిర్పఁ బు
ష్పొడి దలమెక్కి తేనియలు
పొంగి తరంగలుగాఁ జెలంగి పైఁ
వడు నెలదేఁటి దాఁటులకుఁ
బండువులై నవసౌరభంబు లు
గ్గడువుగ నుల్లసిల్లె ఘన
కైరవ షండము నిండువెన్నెలన్!
(నృ. పు. 3-88)

చదలను బొంగారి దిశల ముంచివేయుచున్న చంద్రి కాంబోనిధిని గమనింపుడు.

ఇవి యన్నియు ఎఱ్ఱన్నగారి భావనా చిత్రములు! ఇట్లు జూచుచు బోయిన యెన్నియైన చిత్రములు చూడ వచ్చును. ఇవన్నియు నెఱ్ఱన్నగారి మనసున మొలిచిన మనో హర పుష్పలతలు.

సీ॥ కరఁగెడు నవచంద్ర కాంతోపలంబుల
తఱచు సోనలఁ గడు దలముకొనుచు!
జటుల చకోర సంచయముల యొఱకల
గర్వంపు దాఁటుల గడలుకొనుచు
విరియుకైరవముల విపుల రంధ్రములపైఁ
దీవ్రంబుగాఁ గ్రమ్మి త్రిప్పికొనుచుఁ
గామినీజనముల కమనీయ విభ్రమ
స్మితకాంతి లహరుల మెండు కొనుచుఁ

గీ॥ బొదలి పొదలి చదలఁ బొంగారి పొంగారి
మించి మించి దిశలు ముంచి ముంచి!
అభినుతేందు చంద్రికాంబోధి యఖిలంబు
నీట నిట్టలముగ నిట్టవొడిచె! (నృ.పు. 3-90)

సతీపతుల శృంగారము వర్ణించుట గూడా ప్రబంధ సామగ్రియే గదా! గమనింపుడు!

క॥ లలితోత్తరచ్ఛదంబగు
తలిమంబునఁ దాను హృదయ దయితయు రాఁగా
కులసుప్తిఁ బొందె గంగా
పులిన తటాభము మహేంద్ర పురదంతి క్రియన్!
(నృ.పు. 3-104)

కడలి పెనుతరంగము లెట్లు తాండవ మాడెడు హరుని భంగి నొప్పుచున్నవో గమనింపుడు! ఎట్టి భావనాశక్తి!

తో॥ కడలు చేతు లార్చుచు ఫేన ఘనతరాట్ట
హాస రుచితో ప్రవాళ జటాలి విద్రిచి!

ఊర్ధ్వశిఖి ఫాలలోచనం బనగ సింధు
వమరుఁ దాండవమాడెడు హరుని బోలి! (నృ. 1-34)
మున్నీటి ముద్దుకూఁతు మేల్కాంచిన చందనమును
గమనింపుడు!

సీ॥ నెరసిన చిక్కాని యిరు చన్నుగవ చెన్ను
పూరిపూర్ణ కుంభ విభాతి యనఁగ
జెలిక్రాలు కన్నులఁ బోలయు మెఱుంగులు
కోలు నీరాజన లీల లనఁగ
జిగిమీఱు పలుచని చెక్కుల చెలువంబు
రమణీయ దర్పణ రచన యనఁగ
దళుకొత్తు చిఱునవ్వు తెలుపుల సొంపులు
పుష్పోపహార విస్ఫూర్తి యనఁగ
గీ॥ తన మనోహర భావంబు దన విభునకు
నుచిత మంగళ విధముల నుల్లసిల్ల
మున్న మేల్కాని మున్నీటి ముద్దు కూఁతు!
రమరె! నీలాబ్జ మధుప గానములు చెలఁగ!
(నృ.పు. 3-2)

ఇట్లే ఎన్నెన్నియో మధుర కల్పనా చిత్రములను సందర్శించుచు బోవచ్చును. ఎట్టిన ప్రతి పద్యమును ఒక కల్పనా చిత్రము. రమణీయమైన శృంగారము, ప్రకృతి సుందర దృశ్యములు అడుగడుగున ప్రత్యక్ష మగుచుండును. ఎట్టిన గారు ప్రబంధ కవుల కందించిన కావ్య సామగ్రిని దర్శించితిమి. ఇక మఱియొక విషయమునకు మఱలుదము!

భక్త ప్రహ్లాద చరిత్ర రచనమునందు

## ఎఱ్ఱనగారిని పోతన్నగా రనుసరించెనా?

పోతన్నగారు భాగవతాంధ్రీకరణమున ప్రహ్లాద చరిత్రమునందు కొన్ని పద్యములను ఎఱ్ఱన్నగారి ననుసరించె నను ఒక యపవాదము గలదు. పరిశీలింతము.

ఎప్పుడును ప్రతివిషయమునను ముందు తరమువారి ప్రభావము తరువాత తరమువారిపై బడుట సహజమే! ఇవి కాదనుట కెవ్వరి సాధ్యమును కాదు!

నిజమునకు ఎఱ్ఱన్న-పోతన్న గారలు గైకొనిన లక్ష్యములు, గమ్యములు వేఱు వేఱు. పోతన్న ప్రత్యేకముగా ప్రహ్లాద చరిత్రననువదింపలేదు. భాగవతాంధ్రీకరణమందు ప్రహ్లాదకథయొక యంతర్భాగము. సహజ పాండిత్యసంపదతో గజేంద్ర మోక్షము, రుక్మిణీ కల్యాణము, వామన చరిత్రము మున్నగు భాగవత కథాంశములెట్లు రచించెనో ప్రహ్లాద చరిత్రమును గూడ నట్లే రచించెను. ప్రహ్లాద చరిత్ర కొఱకాయన యెట్టి ప్రత్యేక శ్రద్ధను తీసికొనలేదు.

అదివఱకే నృసింహ పురాణ రూపమున నున్న ప్రహ్లాద చరిత్ర పోతన్నగారు చదివి యుండవచ్చును. ఎఱ్ఱన్నగారి ప్రబంధ కవితా ధోరణినిజూచి, ఆనందమును, ఆశ్చర్యమును బొందియుండవచ్చును. తనకంటె పూర్వుడైన యెఱ్ఱన్నగారి ప్రభావము పోతన్నగారిపై బడియుండ వచ్చును.

కాని భాగవతాంధ్రీకరణ రచనా విధానమందు తన ప్రత్యేకమైన యభిరుచులనందు ప్రవేశపెట్టతలచుకొనలేదు. వ్యాసుని సంస్కృత భాగవతమును తెనుగున యనువదించుటే తన లక్ష్యము. సంస్కృత భాగవతము భక్తిరస పూరితమైనది. ఆ భక్తి భావమున తాను దరించి లోకమును దరింపజేయుటే పోతన్నగారి లక్ష్యము.

పోతన్నగారి హృదయము భక్తి విషయమున యినుముతో సమానమైనది భగవంతుడాయన కయస్కాంతము, భగవంతునికి, భాగవతసిద్ధాంతమునకు మాత్రమే అతడాకర్షింపబడును. మఱింకే విషయమునకుగాని, సిద్ధాంతమునకుగాని యాకర్షింపబడుడు. లోబడుడు! ప్రక్కదారులకు బోడు అతనికి కావలసినవి రెండే రెండు విషయములు. ఒకటి శ్రీ కైవల్య పథంబు. రెండవది పునర్జన్మము లేకుండుంట.

క॥ ఏపగిది వారు సెప్పిన
నాపగిదిం జదువుఁగాని యట్టిట్టని యా
క్షేపింపడు తా నన్నియు
రూపించిన మిధ్యలని నిరూఢ మనీషన్

లోకమున యెన్ని విషయములు జూచినను రూపించిన మిధ్యలని భావించును. పోతన్నగారు నూతన విషయములకు గాని ఆశ్చర్య జనకములైన, భ్రాంతి జనకములైన భావములకు లోనుగాడు! ప్రహ్లాదునికివలె నతనికి నిరూఢమనీషత గలదు. ఇనుమయస్కాంత సన్నిధినెట్లు భ్రాంతమగుచుండునో భక్తి, భాగవతములకు మాత్రమే నతడు భ్రాంతమగుచుండును.

నిజమునకు భాగవత ప్రహ్లాదుని భావమిదియగునో కాదోగాని పోతన్నగారి భావమిది యని చెప్పవచ్చును.

ఉ॥ ఎల్ల శరీర ధారులకు
నిల్లను చీకటి నూతి లోపలం
ద్రెళ్ళక మీరు నేమను మ
తి భ్రమణంబున భిన్నులై ప్రవ
ర్తిల్లక సర్వము న్నతని
దివ్య కళామయమంచు విష్ణునం
దుల్లము జేర్చి తా రడవి
నుండుట మేలు నిశాచరాగ్రణీ !

పోతన్నగారిది మునిమతము. నారదు డుపదేశించినది. సర్వము న్నతని దివ్య కళాయమంచు భావించువాడు.

పోతన్నగారు అన్నియు బఠించును. ఆలించును. కాని యేకాగ్రతను చలింపని వైష్ణవభక్తి పూర్ణుడు. పెద్దల నాక్షేపింపడు. ప్రహ్లాదునివలె లలిత మర్యాదను జూపును.

అట్లే ఎఱ్ఱన్నగారి ప్రభావము తనపై బడినను తన మార్గంమునుండి పోతన్నగారు చలింపడు. భాగవతాంధ్రీకరణము తన యేకైక లక్ష్యము. శ్రీరామచంద్రున కంకిత మిచ్చుట ! తద్వార శ్రీకైవల్య పథంబును జేరుట ! ఇదీ పోతన్నగారి యాశయము. భక్తిపారవశ్యమున భాగవత కథాంశమును గొంత. విస్తృత పఱచి యుండవచ్చును. కాని వ్యాసుడు గీచిన గీతలు దాటలేదు. హద్దు లతిక్రమింపలేదు.

ఎఱ్ఱన విధానములు వేఱు ! ఇల్లును చీకటిగా భావింపడు. వెన్నెలగా భావించును. భూమియందే స్వర్గమును,

నందనవనమును సృజింప గోరును. పోతనకువలె బ్రహ్మానంద మును గోరడు ! రసానందమును గోరును. ప్రకృతిని భగ వంతునికి భేదము నెంచడు. సౌందర్యమును ప్రతి వస్తువు నందు దర్శించును. అన్ని హింసలు పెట్టిన తండ్రిని గూడ నరసింహాదేవుని శరణువేడుమని కోరును. ప్రహ్లాదు డెంతటి స్థితప్రజ్ఞుడో, మానవతా వాదియో స్పష్టమగును.

ఇట్టి వేలువేలు విధానములు, సిద్ధాంతములు గల వారు ప్రహ్లాదుని చరిత్రను రచించిరి. వారి వారి మనోభావ ములు ఆ చరిత్రముల యందును, నందలి పాత్రలయందును దర్శనమిచ్చుచునే యున్నవి.

ఎఱ్ఱన్నగారు సృజించిన నృసింహ పురాణమునకు, పోతన్న గారాంధ్రీకరించిన భాగవతమునకును మూలము విష్ణుపురాణమే ! ఇరువురు ప్రతిభావంతులు, మహాకవులు, దైవ సహాయసంపన్ను లనుసరించినపుడు పదవాక్య రచనా సౌందర్యము లొక్కొక్కచోట పోలికలు కనిపింప వచ్చును.

అట్లు పోలికలు కలియునపుడు ముందు తరము వారిని వెనుక తరము వారనుసరించిరని యపవాదము వచ్చుట కలదు. పోతన్నగారి విషయమున నట్లే జరిగినది. ఎఱ్ఱన్న గారి నృసింహ పురాణము నందలి కొన్ని పద్యములను బోతనగా రనుసరించిరని యొక యపవాదము గలదు.

ఎఱ్ఱన్నగారి ప్రభావము పోతన్నగారిపై బడియుండ వచ్చును. కాని వారి పద్యములను వీ రనుసరించిరనుట సరి కాదని కొందఱి యభిప్రాయము. ఇది సరియైనదనియే సని మనము భావింతము.

ఎందువలననగా పోతన్నగారు మొదలుపెట్టినది ద్వాదశస్కంధములు గల మహాగ్రంథము. ఎఱ్ఱన్నగారు తల పెట్టినది అహోబల తీర్థమహాత్మ్యమును ప్రబంధ రీతిలో వర్ణించుట. పోతన్నగారు తలపెట్టినది వేయి స్తంభముల దేవాలయము. ఎఱ్ఱన్నగారు తలపెట్టినది బంగారు గోపురము. పోతన్న నిర్మింప దలచినది తాజమహాల్ ! ఎఱ్ఱన్నగారు నిర్మింపదలచినది అజంతా, ఎల్లోరా చిత్రలేఖనములు!

ఈ ఇరువురు మహాకవులు ఒకే మూలగ్రంథము ననుసరించినప్పుడు పదవాక్య రచనా సౌందర్యము లచ్చుటచ్చుట పోలికలు కనిపింపవచ్చును. అంతమాత్రమున ఎఱ్ఱన్నను పోతన యనుసరించినాడనుట సరికాదని కొందఱి యభిప్రాయము. ఆ యభిప్రాయమే సరియైనదని భావింపవచ్చును. అందుల కా యిరువురు రచించిన కొన్ని కథాఘట్టములను, పద్యములను బరిశీలింతము.

ప్రథమమున జయవిజయులు సనకసనందనాదులచే శాపము నొందుట బరిశీలింతము. నృసింహ పురాణమున విప్రశాపఘట్టము.

తే॥ అఖిల లోక గమ్యుఁ డగు పరమేశ్వరుఁ
జూడఁ గొల్వ నబ్బు సుకృతమునకు
అంతరాయ మైతి రట్టి తంబుద్దురితము !
ఫలము ననుభవింపవలయు మీరు !

(నృ. పు. 1-88)

ఉ॥ కావున ధర్మ విద్విషులు
కల్మషకారు లనంగ దుష్టమో

హావిల బుద్ధితో నసుర
లై జనియింపుఁడు సంతతంబు ల
క్ష్మీవిభు మీఁది మచ్చరము
గిక్కయుఁ గాఱియఁ బెట్టుగాఁత ! మీ
భావము లిప్డు డే పగిది
బాములు పెక్కగు నిక్క మెంతయున్
(నృ. పు. 1-89)

పోతన్నగారి భాగవత ఘట్టమును బరిశీలింపుడు.

కం॥ డింభకుల ననర్గళ వి
స్రంభకుల రమాధినాథ ! సల్లాప సుఖా
రంభకుల ముక్తమానస
దంభకులం జొఱగ నీక తఱిమి రధీశా! (భాగ.స.22)

కం॥ వారించిన తమకంబున
వారించుక నిలువనీక వడిఁ దిట్టిరి దా
వారికుల నసుర యోని న
వారితులై బుట్టుఁ డనుచు వసుధాధీశా!(భాగ.స.23)

ఇరువురి పద్యముల భావమొక్కడే యైనను పద వాక్య రచనా విధానములు వేఱుగా నున్నవి. క్రిందిపద్యము నృసింహ పురాణములోనిది.

ఉ॥ ఆడఁగ బోయి నప్డు డసు
రాత్మజుఁ డంబుజనాభు నవ్వయుం
బాడుద మాదిదేవు పద
పంకజ పూజలుసేసి భక్తిమై !

నాడుద మచ్యుతైక శర
ణాగతులం గని కర్మబంధముల్
వీడుద మంచుఁ బల్కు గడు
విస్మయమందఁగఁదోడిబాలకుల్! (నృ.3-149)

ఆ. కుడిచినపుడు నిద్ర గూరినయప్పుడు
మేలుకొనిన యపుడు మెలఁగినప్పుడు
విష్ణుకీర్తనంబు విష్ణు చింతయకాని
పలుకఁ డొండు బుద్ధిఁ దలపఁ డొండు. (నృ. 3-150)

పోతనప్రహ్లాదయం దీ పద్యమును బరిశీలింపుడు.

శా॥ పానీయంబులు ద్రావుచుం గుడుచుచున్
భాషించుచున్ హాసలీ
లా నిద్రాదులు సేయుచుం దిరుగచున్
లక్షించుచున్ సంతత
శ్రీనారాయణ పాదపద్మయుగళీ
చింతామృత స్వాద సం
ధానుండై మఱచెన్ సురారి సుతుఁడే
తద్విశ్వమున్ భూవరా ! (భాగ. స. 123)

పై రెండు పద్యములలోగల భావమొక్కటే! ఐనను పదవాక్య శైలీసుందరములు వేఱువిధముగా నున్న వని తెలుప నవసరము లేదు.

తండ్రి కొడుకును బిలిచి విద్యాపరీక్ష చేయు సందర్భము. నృసింహ పురాణము లోనిది.

ఉ॥ పాపఁడ యింతకాలమును
బాయక యొజ్జల యొద్దనుండి నీ

వే పగిదిన్ బఠించి తది
యేర్పడఁ బ్రస్ఫురితార్థసారమై
తీపులు వీనులన్ గుఱియ
దివ్యసుభాషిత రత్నమొక్క టు
ద్దీపిత ధీవిజృంభణ వి
ధేయతనొప్ప నుపన్యసింపుమా!

(నృ. పు. 4-5)

అదేవిషయమును దెలుపుచున్న పోతన్నగారిపద్యము బరిశీలింపుడు.

శా॥ చోద్యంబయ్యెడి నితకాల మఱిగెన్
శోధించి యేమేమి సం
వేద్యాంశంబులు సెప్పిరో గురువు తే
వెంటం బఠింపించిరో
విద్యాసార మెఱుంగ గోరెద భవ
ద్విజ్ఞాత శాస్త్రంబులో
పద్యం బొక్కటి సెప్పి సార్థముగఁ
దాత్పర్యంబు భాషింపుమా (భాగ. స. 163)

చండామార్కులను దైత్యుడు గోపించుట గమనింపుడు. నృసింహ పురాణములోనిది.

ఉ॥ అక్కట బ్రహ్మబంధువ! దు
రాత్మక! నా పగవాని కీర్తనం
బెక్కడినుండి యీ శిశువు
నెప్పగిదిం జదివించి తిజ్జగం

బెక్కటి నేలు నా మహిమ
యేమియుఁ గైకొన కి వ్విధంబునం
దక్కవపా టొనర్చితి
వృథా పరిజల్పన కల్పనంబునన్.(నృపు. 4-9)

పోతన్నగారి పద్యమును గమనింపుడు

చం॥ పటుతర నీతిశాస్త్ర చయ
పారగుఁ జేసెదనంచు బాలు నీ
వటుగొనిపోయి వానికి
ననర్థములైన విరోధి శాస్త్రముల్
గుటిలతఁ జెప్పినాడవు
భృగుప్రవరుండ వటంచు నమ్మితిం
కటకట బ్రాహ్మణాకృతివి
గాక యథార్థము బ్రాహ్మణుండవే?
(భాగ. స. 174)

మూలార్థభావములొక్కటేయైనను ఒకేతీగెకుబూచిన రెండు పూవులవలెఁ బ్రకాశించుచున్నవి. దేనికది సహజమై యొప్పుచున్నవి. పురోహితుని సమాధానము వినుడు. ఎఱ్ఱన గారి పద్యము.

చ॥ కినియకు దైత్యనాథ! యొక
కీడును నాదెస లేదు చెప్ప నీ
తనయుఁడు వక్రశీలుఁడు
నితాంత నయోక్తుల నేను సెప్పఁగా
వినక నిజేచ్ఛమైఁ గడఁగి
వేమఱు నిట్లన యుగ్గడించు నీ

యనువున నిట్టి కోరడపు
టాలరి శిక్షల కేల చేపడున్? (నృ.పు. 4-11)

పోతనగారి పద్యము.

ఉ॥ తప్పులు లేవు మావలన
దానవనాథ! విరోధి శాస్త్రముల్
సెప్పము క్రూరులై పరులు సెప్పరు
మీ చరణంబు లాన సు
మ్మెప్పుడు మీ కుమారునకు
నింతయు నైజ మనీష యెవ్వరుం
జెప్పెడి పాటిగాదు ప్రతి
చింతఁ దలంపుము నేర్పు కైవడిన్!
(భాగ.స. 176)

కం॥ మిత్రులము! పురోహితులము
పాత్రుల మే మదియుఁగాక భార్గవులము! నీ
పుత్రుని నిటువలెఁ జేయగ
శత్రులమే దైత్య జలధిచంద్రమ! వింటే!
(భాగ. స. 177)

ఇరువురి పద్యములలోనున్న భావ మొక్కటియే యైనను భాషలో యెంతో వైరుధ్యమున్నది. ఎవరి రచనా విధానము వారిదే!

బ్రహ్లాదుని దైత్యుడు ప్రశ్నించుట జూడుడు. ఎఱ్ఱన పద్యము.

క॥ ఓ వత్స! నీవు చెప్పిన
యీ విధ మేఁ జెప్ప ననియొ నిదె యొజ్జలు నీ

కేవాఁడు గఱపె నేర్పడఁ
గా వెఱవకఁ జెప్పు మట్టి ఖలు దండింతున్!
(నృ. పు. 4-13)

అదే భావము వెలువరించుచున్న పోతన పద్యము.

క॥ ఒజ్జలు సెప్పని యీమతి
మజ్ఞాతుఁడవైన నీకు మఱి యెవ్వరిచే
నుజ్జాత మయ్యె బాలక!
తజ్జనులం బేరుకొనుము తగ నా ప్రోలన్
(భాగ.స. 179)

క్రింది పద్యములు జూడుడు! భాషయందును భావము నందును యెంతవైరుధ్యమున్నదో! పద్యమెఱ్ఱనది!

ఉ॥ నావుడు దైత్యరాజ కుల
నందనుఁ డిట్లను సర్వభూత స
ద్భావము లందునుండి పను
పం గఱపంగఁ బ్రభుం డొకండు నా
దేవుఁడు వాసుదేవుఁడు సు
ధీ సువిధేయుఁడు చిత్సుఖోదయ
శ్రీవరుఁ డింతకంటె మఱి చెప్పఁ
గలండె ప్రశాస్త్రి యెవ్వడున్!
(నృ. పు. 4-14)

పోతనగారి పద్యమును గమనింపుడు.

ఉ॥ అచ్చపుఁ జీకటింబడి గృ
హవ్రతులై విషయవ్రవిష్టులై

చచ్చుచుఁ బుట్టుచున్ మఱలఁ
జర్వితచర్వణులైన వారికిం
జెచ్చెఱఁ బుట్టునే పరులు
సెప్పినసైన నిజేచ్ఛనైన నే
మిచ్చినసైన గానలకు
నేగినసైన హరిప్రబోధముల్! (భాగ.స. 181)

అదే సందర్భమున ప్రహ్లాదుడు తండ్రికి చెప్పిన సమాధానము ఎఱ్ఱనగారి పద్యము.

చ॥ అనుటయు నల్ల నవ్వి కొడు
కయ్యకు నిట్లను నెవ్వఁ డన్న నే
మని తెలుపంగవచ్చుఁ బర
మాత్ముని నాతఁడ యీ సమస్తమున్
వినుము! తదేక హేతుకము
విశ్వము శాశ్వతమైన తత్పదం
బనిశము పుణ్యశీలురు ని
జానుభవంబునఁ గాంతురేర్పడన్॥ (నృ.4-16)

పోతన్నగారి పద్యమును గమనింపుడు.

ఉ॥ కాననివాని నూతనగొని
కాననివాడు విశిష్టవస్తువుల్
కానని భంగిఁ గర్మములు
సైకొని కొందఱు కర్మబద్ధులై
కానరు విష్ణుఁ గొంద ఱటఁ
గందు రకించన వైష్ణవాంఘ్రి సం

స్థాన రజోభిషిక్తులగు
సంప్రాప్త కర్మలు దానవేశ్వరా!
(భాగ.స. 182)

అనుచరులనుగాంచి దైత్యు డేమనుచున్నాడో వినుడు!
ఎఱ్ఱన్నగారి పద్యములు!

క॥ కులమునకు గొప్ప గుద్దలి
ఖలుఁడు కులాంగారకంబు కష్టుఁడు వీఁడిం
బొలియింపుఁడు ఘనశస్త్రం
బుల వెస నొక గుద్దు మురిగిపో నేమి యగున్!
(నృ.పు. 4-25)

ఆ॥ కొడుకు తండ్రిమాటఁ గొనక యీ రసమున
నడుచునేని వాఁడు కడిఁది దాయ!
గాన బగతుఁ జంపఁ గాఁ దగుఁ బగవాని
పక్షమైనవారు పగఱె కారె? (నృ.పు. 4-26)

క్రింది రెండు పద్యములు పోతన్నగారివి. పై పద్యములలోని భావము క్రింది పద్యములలోనున్నను ఎవరి పోకడలు వారివే! ఎవరి రచనా విధానము వారిదే!

శా॥ పంచాబ్దంబులవాఁడు తండ్రినగు నా
పక్షంబు నిందించి య
త్యంచిద్భీతియు లేక విష్ణు నహితుం
గీర్తించుచున్నాడు వ
ల్దంచుం జెప్పిన మానఁ డంగమున బు
త్రాకారతన్ వ్యాధి జ

క్షించెన్ వీని వధించి రండు దనుజుల్
మీ మీ పటుత్వంబులన్!
శా॥ అంగవ్రాతములో జికిత్సకుడు దు
ష్టాంగంబు ఖండించి శే
షాంగశ్రేణికి రక్ష సేయుక్రియ నీ
యజ్ఞుం గులద్రోహి దు
స్సంగుం గేశవ పక్షపాతి నథముం
జంపించి వీరవ్రతో
త్తుంగఖ్యాతిఁ జరించెదన్ గులము
నిర్దోషంబు గావించెదన్!

కం॥ హంతవ్యుఁడు రక్షింపను
మంతవ్యుఁడు గాఁడు యముని మందిరమునకున్
గంతవ్యుఁడు వధమునఁ గుప
రంతవ్యం డనక చంపి రండీ పడుచున్!

(భాగ.స. 189)

రెండు ప్రహ్లాద చరిత్రల యందుగల ఎఱ్ఱన - పోతన పద్యములిట్లే యెన్నైన జూపుచు బోవచ్చును. వారు గ్రహించినదిఒకే మూలమైనందున సహజముగా పద్యములిట్లు వచ్చుచున్నవి. కాని ఎవరి పోకడ వారిదే! రక్కసులు ప్రహ్లాదుని హింసించు ఘట్టములోనిది! ఎఱ్ఱనగారి పద్యము!

చం॥ అనుపమ మేరు భూధర త
టాధిక నిష్ఠుర వజ్ర వజ్రసం
హనను గుమారుఁ జెంది యసు
రాధమ కింకర నిర్విశంక పా

స్థాన రజోభిషిక్తులగు
సంహృత కర్ములు దానవేశ్వరా!
(భాగ.స. 182)

అనుచరులనుగాంచి దైత్యు డేమనుచున్నాడో వినుడు!
ఎఱ్ఱన్నగారి పద్యములు!

క॥ కులమునకు గొప్ప గుద్దలి
ఖలుఁడు కులాంగారకంబు కష్టుఁడు వీనిం
బొలియింపుఁడు ఘనశస్త్రం
బుల వెస నొక గుడ్డు మురిగిపో నేమి యగున్!
(నృ.పు. 4-25)

ఆ॥ కొడుకు తండ్రిమాటఁ గొనక యీ రసమున
నడుచునేని వాఁడు కడిఁది దాయ!
గాన బగతుఁ జంపఁ గాఁ దగుఁ బగవాని
పక్షమైనవారు పగతు కారె? (నృ.పు. 4-26)

క్రింది రెండు పద్యములు పోతన్నగారివి. పై పద్యములలోని భావము క్రింది పద్యములలోనున్నను ఎవరి పోకడలు వారివే! ఎవరి రచనా విధానము వారిదే!

శా॥ పంచాబ్దంబులవాఁడు తండ్రినగు నా
పక్షంబు నిందించి య
త్యంచిద్భీతియు లేక విష్ణు నహితుం
గీర్తించుచున్నాడు వ
ల్దంచుం జెప్పిన మానఁ డంగమున బు
త్రాకారతన్ వ్యాధి జ

క్షమించెన్ వీని వధించి రండు దనుజుల్
మీ మీ పటుత్వంబులన్!

శా॥ అంగవ్రాతములో జికిత్సకుడు దు
ష్టాంగంబు ఖండించి శే
షాంగశ్రేణికి రక్షసేయుక్రియ నీ
యజ్ఞుం గులద్రోహి దు
స్సంగుం గేశవ బక్షపాతి నధముం
జంపించి వీరవ్రతో
త్తుంగఖ్యాతిఁ జరించెదన్ గులము
నిర్దోషంబు గావించెదన్!

కం॥ హంతవ్యుడు రక్షింపను
మంతవ్యుడు గాఁడు యముని మందిరమునకున్
గంతవ్యుడు వధమున కుప
రంతవ్యుం డనక చంపి రండీ పడుచున్!

(భాగ.స. 189)

రెండు ప్రహ్లాద చరిత్రల యందుగల ఎఱ్ఱన - పోతన పద్యములిట్లే యెన్నైన జూపుచు బోవచ్చును. వారు గ్రహించినదిఒకే మూలమైనందున సహజముగా పద్యములిట్లు వచ్చుచున్నవి. కాని ఎవరి పోకడ వారిదే! రక్కసులు ప్రహ్లాదుని హింసించు ఘట్టములోనిది! ఎఱ్ఱనగారి పద్యము!

చం॥ అనుపమ మేరు భూధర త
టాధిక నిష్ఠుర వక్షు వజ్రసం
హనను గుమారుఁ జెంది యసు
రాధమ కింకర నిర్విశంక పా

తన కనదస్త్ర శస్త్రములు
దండడి దుత్తుము రై మహీతలం
బున దొరఁగె న్నవోత్పల స
ముజ్జ్వల నూత్న దళంబులో యనన్! (4. 31)

అదే భావమును వెలువరించుచున్న పోతన్నగారి పద్యము గమనింపుడు!

ఉ॥ బాలుఁడు రాచబిడ్డఁడు కృ
పాళుఁడు సాధుఁడు లోకమాన్య సం
శీలుఁడు వీఁ డవధ్యుఁడని
చిక్కక స్రుక్కక క్రూరచిత్తులై
శూలములం దదంగముల
నుస్థిరులై ప్రహరించి రుగ్రవా
చాలత నందఱున్ దివిజ
శత్రుఁడు వల్దనఁడయ్యె భూవరా !(భా. 191)

ప్రహ్లాదుని జక్క బఱతుమని దైత్యునితో గురుపుత్రులు బల్కుట నృసింహ పురాణములోని పద్యములు!

చ. మునుమునఁ బుట్టి! నీ కకట
ముద్దుల పట్టి గదయ్యె వీఁడు మె
త్తని యొడలింత యోర్చునె? కృ
తంబులు సైఁచునె? మాను మింతతోఁ,
గినుకలు; నీవు గట్టలుక
కీ డొనరింపఁగఁ బొంద జాలువా
రనిమిష సిద్ధ యక్ష ఖచ
రాదులుగాక తనూజుఁడే నృపా? (నృ. పు. 4-54)

క॥ బాలత్వ మెల్ల కేళ్ళకు
నాలయ మట్లగుట వినియు నజ్ఞానము ద
పైప్ర లొంచ్చు వడ(గ గోపం
జేలా నీయంత వారి కిప్పడుచు పయిన్!

(నృ.పు. 4-55)

గీ॥ అవధరింపుము మాపంత మధిప! యేము
వదల కీ బాలు శిక్షించు వార మింక!
నొయ్య నొయ్యన( దెలివికి నోజ పఱిచి
వెట్టి దీర్ఘము మాటలు వేయునేల?

(నృ.పు. 4-56)

గీ॥ ఈతనికి విష్ణుదెస గల
ప్రీతి విడువ( దెలుపు టెంత పెద్ద యధికరో
పాతురు(డై యిత( డతని వి
ఘాతింపను గడ(గు బుద్ధి గలపెద మోలిన్!

(నృ.పు. 4-57)

ఈ నాలుగు పద్యములలోగల భావము రెండు పద్యములలో గమనింపుడు. ఎవరి భావనాదృష్టి వారిదే!

శా॥ శుభ్రఖ్యాతివి! నీ ప్రతాపము
మహా చోద్యంబు దైత్యేంద్ర రో
షభ్రూయుగ్మ విజృంభణంబున దిగీ
శవ్రాతముం బోరులన్
విభ్రాంతంబుగ( జేసి యేలితి గదా! వి
శ్వంబు నీ(డెంత? యీ

దభ్రోక్తుల్ గుణదోష దూరములు చిం
తం బొంద నీ కేటికిన్ ?

(భాగ.స. 206)

శా॥ వక్రుండైన జనుండు వృద్ధగురు సే
వం జేసి మేధానయో
పక్రాంతిం విలసిల్లు మీఁదట వయః
పాకంబుతో బాలకున్
శక్రద్వేషణ బుద్ధుఁ జేయుము మదిం
జాలింపు మీ రోషమున్
శుక్రాచార్యులు వచ్చునంత కితఁడున్
సుశ్రీయుతుం డయ్యెడున్ !

(భాగ.స. 207)

భావమొక్కడే యైనను రచనారీతిలో భేదమున్నది. కొంత కథాంశమందుగూడ మార్పుగలదు.

క్రిందిపద్యము నృసింహ పురాణము పంచమాశ్వాసములోనిది. ప్రహ్లాదుడు శుక్రునితో పలికినది.

సీ॥ వాసుదేవుని పాద వనరుహంబుల భక్తి
తగదను దండ్రియుఁ దండ్రి గాఁడు !
వేదచోదితమైన విష్ణు ధర్మమునకు,
గోపించు గురుఁడును గురుఁడు గాఁడు !
భవదుఃఖముల మాన్పఁ బ్రభువైన హరిసేవ
నెడలించు హితుఁడును హితుఁడు గాఁడు !
పరయోగ మత మగు వైష్ణవ జ్ఞానంబు
వదలిన చదువును జదువు గాదు !

గీ॥ కేశవాకార లీలలు గీలుకొని ము
దంబుఁ బొందని తలఁపును దలఁపు గాదు,
మాధవస్తోత్ర ఘనసుధా మధుర రుచులఁ
జిలుక కుండెడి జిహ్వయు జిహ్వగాదు !

(నృ. పు. 5-22)

భాగవతములోని పోతన్న పద్యమును గమనింపుడు !

సీ॥ కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ !
సురరక్షకుని జూచు చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు శిరము శిరము !
విష్ణు నాకర్ణించు వీనులు వీనులు
మధువైరి దవిలిన మనము మనము
భగవంతు వలగొను పదములు పదములు
పురుషోత్తముని మీఁది బుద్ధి బుద్ధి !

గీ॥ దేవదేవుని జింతించు దినము దినము !
చక్రహస్తుని బ్రకటించు చదువు చదువు !
కుంభినీ ధవుఁ జెప్పెడి గురుఁడు గురుఁడు !
తండ్రి హరిఁ జేరుమనియెడి తండ్రి తండ్రి !

(భాగ. స. 169)

వేఱు వేఱు స్వతంత్ర రచనా రీతులు సూక్ష్మముగా బరిశీలించిన బోధకమగును.

క్రిందిపద్యము కొడుకు తండ్రితో బలికినది. ఎఱ్ఱన్న గారిది.

ఉ॥ ఊషర బీజముల్ భసిత
యోాజ్య ఘృతంబులు షండకన్యకా
న్వేషణముల్ పయోధిగత
వృష్టితతుల్ మృగతృష్ణికాంబు గం
డూషలు దుర్గకానన క
ఠోరిత చంద్రిక లేడమూక స
ద్భాషలు విష్ణుమంగళ క
థా విముఖాత్ముల దుష్టజన్మముల్ !

(నృ. పు. 5-24)

ఇట్టి భావముననే వెలువరించుచున్న పోతన్నగారి పద్యము.

శా॥ అంధేందూదయముల్ మహాబధిర శం
ఖారావముల్ మూకస
ద్గ్రంథాఖ్యాపనముల్ నపుంసకవధూ
కాంక్షల్ కృతఘ్నావలీ బంధు
త్వంబులు భస్మహవ్యములు లు
బ్ధ ద్రవ్యముల్ క్రోడ స
ద్గంధంబుల్ హరిభక్తి వర్జితుల రి
క్తవ్యర్థ సంసారముల్ ! (భా. స. 168)

రెండు పద్యముల యందుగల భావ మొక్కటే ! దేనికదె ప్రత్యేకతను స్ఫురింప జేయుచున్నవి. క్రింది పద్యము నృసింహ పురాణము లోనిది. కొడుకు తండ్రితో పలికినది.

క. విష్ణుమయము వేదంబులు
విష్ణుమయయ సర్గ మఖిల విజ్ఞానములున్
విష్ణుమయము జగ మంతయు
విష్ణుమయము విష్ణుఁ డొకఁడ వేద్యుఁడు బుద్ధిన్ !

(నృ. పు. 5-59)

క్రింది పద్యము పోతన్నగారిది. భాగవతము లోనిది. భగవంతు డంతట నున్నాడని చెప్పినది.

కం. ఇందు గలఁ డందు లేఁడని
సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెం దెందు వెదకి చూచిన
నందందే కలఁడు దానవాగ్రణి ! వింటే !

(భాగ. స. 275)

రెండింటి భావ మొక్కటే ! కాని రచనావిధము వేఱు వేఱుగా నున్నది.

భగవంతుడన్ని వస్తువులందున్నాడని చెప్పినది. పద్యము ఎఱ్ఱన్నగారి ప్రహ్లాదుడు పలికినది.

సీ॥ కలఁడు మేదినియందుఁ గలఁ డుదకంబులఁ
గలఁడు వాయువునందుఁ గలఁడు వహ్నిఁ
గలఁడు భానునియందుఁ గలఁడు సోముని యందుఁ
గలడంబరంబునఁ గలఁడు దిశలఁ
గలఁడు చరంబులఁ గలడంబరంబునఁ
గలఁడు బాహ్యంబునఁ గలఁడు లోనఁ

కలఁడు సారంబులఁ గలఁడు కాలంబులఁ
కలఁడు ధర్మంబుల గలఁడు క్రియలఁ
గీ॥ కలఁడు కలవాని యందును లేని
వాని యందును గలఁ డెల్ల వానియందు
నింక వేయును నేల సర్వేశ్వరుండు
కలఁడు నీయందు నాయందుఁ గలఁడు ! కలఁడు !

(వి. పు. 5-78)

పోతన్నగారి భాగవత ప్రహ్లాదుడన్నది గమనింపుడు!

మ॥ కలఁ డంబోధి గలండు గాలి గలఁ డా
కాశంబునం గుంభినిం
గలఁ డగ్నిన్ దిశలం బగళ్ళ నిశలన్
ఖద్యోతచంద్రాత్మలం
గలఁ డోంకారమునం ద్రిమూర్తుల ద్రిలిం
గవ్యక్తులం దంతటన్
గలఁ డీశుండు గలండు తండ్రి! వెదకం
గానేల యీ యాయెడన్ !

పిండితార్థ మేమనగా ఎఱ్ఱన-పోతన ప్రహ్లాద చరిత్రముల కాధారము విష్ణుపురాణమే ! బ్రహ్మాండాది పురాణముల నుండి స్వల్పాల్ప కథాంశమును గైకొని ఎఱ్ఱన వర్ణనములతోను, నూతన కథాంశములతోను ప్రబంధ రీతిని కృతిని నిర్మించెను.

పోతన యట్లుగాక విష్ణుపురాణమునుండి వెలువడిన సంస్కృత భాగవతము నాంధ్రీకరించెను.

మూలాధార మొక్కటే యగుట వలన వారు రచించిన పద్యములు ఒకే మూసలో బోసిన ట్లగుపించును. కాని వారి వారి రచనా శిల్పములు వేఱు వేఱు. ఎఱ్ఱన్నగారి ప్రభావము పోతన్నగారిపై పడియుండ వచ్చును. కాని పోతన్న ఎఱ్ఱన్న ననుసరింప లేదనుటయే సమంజసము.

## అహోబల తీర్థ మహాత్మ్యము

ఎఱ్ఱన నృసింహ పురాణము రచించుటకు ప్రధాన మైన కారణ మహోబల తీర్థమహాత్మ్యమును రచించుటకే యని భావింపవచ్చును. అహోబలస్వామి [illegible] కిష్టదైవము. పితామహుని కాత్మ [illegible] తా నీ గ్రంథమును రచించుచున్నానని పీఠికలో [illegible].

అంతేగాక నీ మహాకవి రెడ్డిరాజుల [illegible] ప్రాప[illegible]మును గోరుచున్నాడు. రెడ్డిరాజు వేమ [illegible] గుటకు మెట్లు కట్టిచ్చి, కానుకలు చెల్లించుచున్నాడు. [illegible] గూడ నా దేవుని కీర్తించి, రాజాదరమును బొంద [illegible]నేమో !

ఈ నాటి తిరుపతి క్షేత్రము [illegible] తీర్థ మానాడు ప్రసిద్ధమై యుండి యుండవచ్చును. ఆ తీర్థము రెడ్డిరాజుల రాజ్యమునగాని, తత్సమీప ప్రదేశమునగాని యుండి యుండవచ్చును. అందులకే రెడ్డిరాజులు ప్రభా[illegible] వితులై యా దేవుని గుడికి కాలిబాటను మెట్లు గట్టించి కృతార్థులైరి.

ఈ యహోబల తీర్థమహాత్మ్యము బ్రహ్మాండాదిపురాణములలో తీర్థభాగ మహాత్మ్యమున నున్నదట ! దాన్ని యెఱ్ఱన స్వీకరించి తాను విన్నదీ కన్నదీ జేర్చి లిఖించి తన గ్రంథాంతమందు నృసింహదేవుడా తీర్థమహాత్మ్యము నాజ్ఞాపించినట్లుగ సమకూర్చెను. ఈ యహోబల తీర్థము కర్నూలు మండలమున నున్నటుల దెలియు చున్నది.

చ॥ సకల సురైక వాసమును
సర్వ మునీంద్ర మయంబు విశ్వతీ
ర్థ కలితమున్ సమస్త సుకృ
త ప్రభవంబునునై త్రిలోకదీ
పకమగు నీ యహోబలము
భక్తి యెలర్ప భజించు సంచితా
త్మకులకు నెల్ల తీర్థములుఁ
దథ్యముగా సమకూరు నెప్పుడున్ !

అచ్చటగల భవనాశినీనది ప్రశంస గలదు. లక్ష్మీవన ప్రశంసయు గలదు. వేదము లచ్చటికి దిగివచ్చి స్వామిని బ్రశంసించుటచే నా గిరికి వేదాద్రియను ఖ్యాతి వచ్చినదట! అహోబలుని భజించువారికి యెట్టి ఫలములు గలుగునో చెప్పబడినవి.

అచ్చట స్వామికి వసంతోత్సవములు జరిపిన వారికనేక పుణ్యఫలములు గలుగునని జెప్పబడినది. అచ్చట జేయు పుణ్యకార్యములకు ఫలములును, అహోబల తీర్థవాసతవలన గలుగు ఫలములు వివరింప బడినవి. ఇలగల

పుణ్యతీర్థముల కెల్లను నహోబల మెక్కుడని దేవదేవుని పలుకులను వినుడు.

చ॥ ఇలఁగల పుణ్యతీర్థముల
కెల్ల నహోబల మెక్కుడన్ తలం
పలవడఁ జేయు మామకము
లై చను భూత భవ ద్భవిష్య ద
త్యలఘుతరావతారముల
కన్నిటికిన్ నరసింహమూర్తి య
గ్గలముగఁ జూడు మివ్విధమ
కా గనుమీ శ్రుతిశాస్త్ర వీథులన్ !

ఫలశ్రుతితో నెఱ్ఱన యీ కృతిని బూర్తిచేయును. ఎఱ్ఱన యీ గ్రంథరచన వలన తాను ధన్యుడై పితృ పితామహుల ధన్యుల గావించెను. నవ్యసాహిత్యమునకు, ప్రబంధ యుగమునకు దారిజూపి, ప్రబంధ పరమేశ్వరుడాయెను.

## ఎఱ్ఱన పోతనల రచనా రీతులు - రమ్య సుందరములు

ఎఱ్ఱాప్రెగడ భావుకుడు. వాగ్భారతి యతని వశమందున్నది. అతని మదిలో నిలిచిన ప్రతిభావము మధురాక్షర వాక్యములతో మంగళ మృదంగ ధ్వనులతో సాక్షాత్కరించినది.

నృసింహపురాణ మంతయు నమృతమయము. ఆనందమయము. మోక్షవిజ్ఞానమును బోధించు వేదాంత గ్రంథము. ఎఱ్ఱన్నగారి నృసింహ పురాణము చదువుటకు కొంత భాషా

జ్ఞానము, సాహిత్యపరిజ్ఞాన మవసరమైయున్నవి. రసగ్రహణ పారీణత యవసరము. మనముందు నిలుపు చిత్రములను భావములను దర్శించు ప్రజ్ఞాపాటవ మవసరమై యున్నది. కొన్ని పద్యములు ద్రాక్షాపాకమున గలవు, అచ్చటచ్చట గ్రంథము ప్రౌఢముగా నున్నను జీడిపప్పు పాకమువలె చదువుచున్నకొలది రుచులూరు చుండును.

పోతనామాత్యుని ప్రహ్లాద చరిత్రమునం దీ కష్ట ముండదు. పాలకోవాబిళ్ళలవలె పద్యములు సాగిపోవు చుండును. అచ్చటచ్చట కఠినపదములు, దీర్ఘసమాసము లున్నను కష్టమేమియు నుండదు. జిహ్వకు రుచి గలిగించును. భక్తిభావమున నుఱ్ఱూత లూగించుచుండును. ప్రవాహము పల్లపు భూములకు బ్రవహించి నట్లుండును. గుల్మాల పూవులను, గులాబీలను గోసికొనుచున్నట్లుండును. కథ వరుస క్రమముగా నుండును. కన్నతల్లి జోలపాట పాడినట్లుండును. ఊ కొట్టుచు నిదురబోవచ్చును.

ఎఱ్ఱన కవిత యట్లుగాదు! సర్వశాస్త్ర పురాణ పారంగతుడైన శ్రీశంకరస్వామి వరప్రసాదము. ప్రాజ్ఞ ప్రస్తుత భవ్యభోగ విభవ స్ఫారాత్మ డారాధ్య సర్వజ్ఞుం డప్రతి మాద్భుతోభయ కవిత్వ ప్రౌఢ శబ్దార్థ యోగాజ్ఞా సిద్ధి ఘనుండు తండ్రిసూరన నుండిసంక్రమించినది. ఎఱ్ఱన రచనలు స్వల్పమే కావచ్చును. పండితులకు తలమానికము. సూత్రధారి ప్రసంగము వంటిది. వసంతమునందు. కోకిలపాట వంటిది. అచ్చర వనిత యందెల రవళి వంటిది యోగికి గలుగు నాత్మవికాసము వంటిది. ఉషోదయము వంటిది.

పోతన ప్రహ్లాద చరిత్రము వర్షాకాలము నందలి వర్ష జలధారలవలె నాహ్లాదము గలిగించును. భక్తిరస భావముల నొడ్డుల నొరిసికొని ప్రవహించుచుండును.

ఎఱ్ఱన ప్రహ్లాద చరిత్రము తొలికాఱు మేఘముల సుందరములను దర్శింపజేయును. ఆకాశమును మేఘములాక్రమించును. ఉఱుములుఱిమి మెఱుపులు మెఱయును. గాలి వీచును. బొటబొటమని వానచినుకులు పడును. భూమి సుగంధము వెల్లివిరియును. ఆవిరిని వెడలగ్రక్కి చల్లదనము వ్యాపించును. ప్రకృతి యదివఱకున్న తాపమును దీర్చుకొనును. వృక్షములు తొలివాన చినుకులలో జలకమాడినంతో హర్షబాష్పములను రాల్చును! నెమళ్ళు పురులువిప్పి నృత్యమును జేయును. వానకోయిలలు కొసరి కొసరి కూయును. మండూకములు మంగళ ధ్వనులు జేయును. ఆకాశమున నింద్రధనుస్సు విరియును. ఇంకెన్నియో చిత్రములు! ఎఱ్ఱన్న కవితలో గూడ నన్ని చిత్రములు! ఆనందము! అమృతము! మధురమైన యూహలు! మంజులమైనధ్వనులు! ఇంకెన్నియో!

పోతన్న ప్రహ్లాద చరిత్రము నిర్మల మందాకినీ వీచికలవలె నాహ్లాదము గలిగించును. తల్లియొడిరీతి తన్మయము నొందుదుము. గురువుముందు గూర్చుని యక్షరములు దిద్దుకొనుచున్నట్లుండును. భగవంతునికి పూజాపుష్పము లర్పించుచున్నట్లుండును. చిలుకలు కథలు చెప్పుచున్నట్లు, జపమాల దాల్చి విశ్వరూపుని స్మరించినట్లుండును.

మందార మకరంద మాధుర్యములు, నిర్మల మందాకినీ వీచికలు, మనకాశ్చర్యమును గలిగింపవు. అరటిపండు

నొలిచి చేతిలో పెట్టినట్లును, అమ్మమ్మ కథజెప్పినట్లుండును. పోతన కథ మనకెన్నడో తెలిసినట్లుండును. ఆ కథ పుట్టి నప్పుడే, అమ్మ కడుపులో నున్నప్పుడే పూర్వజన్మమున మనకా కథ యెవరో జెప్పినదివలె నుండును. పోతనగారి ప్రహ్లాద చరిత్రము మన జీవములో జీవము! భావములో భావము.

ఎఱ్ఱన ప్రహ్లాదుడు మనకు తెలిసిన వాడైనను దూరముగా నుండును. అతను మహనీయ వ్యక్తిగా గనిపించును. ఆతని భావనలు మహోన్నతముగా భాసించును. తండ్రి యెన్ని హింసలు పెట్టినను గోపింపడు. నృసింహ దేవుని వేడుమని ప్రార్థేయ పడును. మాటలు నూతనార్థములను స్ఫురింప జేయును. అతని నర్థము జేసికొనుటకు కొంత సంస్కార మవసరమని భావింతుము. శబ్దచిత్రములతో, భావ చిత్రములతో, మధుర కల్పనలతో, మంజులాలంకారము లతో శోభితమై పండిత జనానందకరమై యొప్పుచుండును.

ఇరువురి రచనా విధానములు వేఱు వేఱు! పోతన మార్గము భక్తిరస ప్రధానమైనది. ఎఱ్ఱన కవితా మార్గము ప్రబంధరీతి. నవనవోన్మేషణమైన నవ కవితను సృజించును. పండితులు మెచ్చుకొనునట్లు, మనీషులు సెబాసనునట్లు నూతన సృష్టిని జేయుట. ఒకరి ధ్యేయము మాధవ భక్తి మాధుర్యములను మానవులలో వెదజల్లుట, మఱొకరి ధ్యేయము నవ్య కవితారీతిని సృజించి నవజీవమును వ్యాపింప జేయుట.

ఎఱ్ఱనగారి ప్రహ్లాద చరిత్రము చదువుటకు కొంత సంస్కారము, శబ్దార్థ పరిజ్ఞానము, భావగ్రహణ నైపుణ్యము కావలసి యుండును. ఎఱ్ఱనగారి నృసింహ పురాణము నృసింహ దేవుని యవతారమునకువలె, శిరస్సు పురాణము! దేహము ప్రబంధము! ఆ దేవుని శాంతింప జేయుట, ప్రసన్నము జేసికొనుట యవసరమై యున్నది.

పోతన్నగారి ప్రహ్లాద చరిత్ర చదువుటకంత కష్టము గాదు! ఆ కథ మనకెన్నో జన్మముల ముందుగనే తెలియును. పోతన్నగారి ప్రహ్లాదుడు మన కాత్మీయుడు! దగ్గఱిచుట్టము!

## ముగింపు - ఫలశ్రుతి

ఆంధ్ర భాషా సరస్వతి కమూల్యములైన యలంకారములను సమకూర్చిన ఎఱ్ఱన-పోతనల మహాకవుల విషయమై ఎన్నో విషయములను సంస్మరించితిమి. వారు పుట్టిన నేల తల్లిని, మాతాపితలను, వంశములను నుతించితిమి. వారల రచనలను, రచనారీతి సౌందర్యములను బ్రస్తుతించితిమి.

అట్లే వారలు రచించిన ప్రహ్లాద చరిత్రములను దుల నాత్మకముగా బరిశీలనము గావించితిమి.

ఎఱ్ఱన్నగారు బ్రహ్మాండాది పురాణముల నుండి స్వల్పాల్ప కథాంశములను స్వీకరించి, సరస బహుపురాణ ధర్మశాస్త్ర కథా విస్తరవేదిగా ప్రబంధరీతిని వర్ణనాత్మకముగా రచించి, ప్రబంధ కవితారీతికి సూత్రధారుడాయెనని తెలిసి కొంటిమి.

అట్లే పోతనయు సహజ పాండిత్య శోభితముగా భక్తి మార్గమున విస్తరించి, సంస్కృత భాగవతము నాంధ్రీకరించె

వనియు దెలిసికొంటిమి. ఈ సంస్కృత భాగవతమునకు మూలము విష్ణుపురాణమనియు దెలిసికొంటిమి.

ఇరువురి ప్రహ్లాద చరిత్రల కథా వృత్తాంతములను ఎఱ్ఱన ప్రవేశ పెట్టిన కథాంశములను, వర్ణనములను, బరిశీలించితిమి. ఎఱ్ఱన ప్రబంధ కవుల కందించిన కవితా సామగ్రిని బ్రత్యక్షము గావించుకొంటిమి. పోతన భక్తి గీతములను భావించి పరవశుల మైతిమి.

పద్యముల నాంధ్రీకరించుటలో నిరువురి పోకడలను, మార్గములను గమనించితిమి.

పోతన్నగారు శాశ్వతమైన, నిశ్చలమైన భక్తిని స్వీకరింపుడని మనకు బోధపఱచిరి.

ఎఱ్ఱనగారు భక్తితోబాటు, నవ్యత్వమును, ప్రకృతి సౌందర్యమును మనకు సాక్షాత్కరింపజేసి యిహపరములను సాధింపుడని మనకు ప్రబోధించిరి.

ఇట్టి సందేశములతో తెలుగు ప్రజలను జాగృత పఱచి, వైతాళికులై, మార్గదర్శకులై, గురువులై, ప్రబోధకులై వారి రచనల వలన మనలను జైతన్యవంతులను జేయుచున్న యీ మహాకవులు చిరంజీవులు! వారికి కోటి కోటి పుష్పాంజలులు!

ఉ॥ శ్రీ రమణీయమైన నరసింహ విహారము నింద్రశత్రుసం
హారముఁ బుణ్యభాగవతుఁడైన నిశాచరనాథ పుత్రసం
చారము నెవ్వఁడైన సువిచారతవిన్నఁ బఠించినన్ శుభా
కారముతోడ నేభయముఁగల్గనిలోకముఁ జెందుభూవరా!

●